


# CHANDAMAMA

It unfolds the glory of India—both past and present—through stories, month after month.

Spread over 64 pages teeming with colourful illustrations, the magazine presents an exciting selection of tales from mythology, legends, historical episodes, glimpses of great lives, creative stories of today and knowledge that matters.

## In 11 languages and in Sanskrit too.

Address your subscription enquiries to:

**DOLTON AGENCIES** 188 N.S.K. ROAD CHENNAI - 600 026



# చందమామ

**డిసెంబర్ 1997**






**విడిప్రతి : 6-00**

**సంవత్సర చందా : 72-00**

# POLIO, QUIT INDIA!

Protect your child and the nation!
Participate in the mass
polio vaccination!




## December 7, 1997
## January 18, 1998

CALLING PARENTS!

Even if

- the child is indisposed or has diarrhoea
- the child had been given polio drops earlier

**TO ENSURE CENT PER CENT PROTECTION**



**Remember to**

Take your children (under 5) to the nearest immunisation booth / centre to receive

**TWO ADDITIONAL DROPS OF THE ORAL POLIO VACCINE on National Immunisation Days**



Be a part of the global Polio Eradication Campaign




**You don't just have to protect, but help eradicate POLIO**







# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : బి.నాగిరెడ్డి


## సంథాలుల తిరుగుబాటు

భారత స్వాతంత్ర్య సంగ్రామం గురించిన విశేషాలను తెలియజేసే రెండు శీర్షికలు ఇప్పుడు మన పత్రికలో వెలువడుతున్నాయి. అయినా, ఇవి సమగ్రం కావు. ఎందుకంటే, చరిత్రకు అందకుండా, కాలమేఘాల చాటున కనుమరుగైపోయిన పోరాటాలు అసంఖ్యాకాలు!

మనదేశంలో పనిచేసిన బ్రిటిష్ అధికారుల గతస్మృతులు, అనాటి రికార్డులు ఆధారంగా– స్వాతంత్ర్య వీరుల గాథలు కొన్ని బయట పడ్డాయి. ఉదాహరణకు 1857వ సం॥లో జరిగిన సిపాయిల తిరుగుబాటు గురించి అందరికీ తెలుసు. అయితే అంతకు రెండేళ్ళక్రితం బీర్భూమ్ ప్రాంత 'సంథాలులు' సాగించిన పోరాటం గురించి అంతగా తెలియదు.

ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల దౌర్జన్యాన్నీ, దారుణమైన దోపిడీనీ కొంతకాలం భరించిన సంథాలులు ఆ తరవాత ఎదురు తిరిగి 'మేము దేవుడి బిడ్డలం; ఎవరికీ బానిసలం కాము' అనే నినాదంతో స్వతంత్రం ప్రకటించుకున్నారు.

కంపెనీ అధికారులు ఆ అడవివీరుల తిరుగుబాటును అణచడానికి యాభై ఏనుగుల చేత మద్యం తాగించి, వాళ్ళ గూడాల మీదికి తోలారు. అవి గూడాలపై పడి పిల్లలనూ, పెద్దలనూ, స్త్రీలనూ, పురుషులనూ ఎడా పెడా తొక్కి చంపాయి. దాంతో ఆగ్రహం చెందిన సంథాలులు విల్లంబులు, బరిసెలు చేతబట్టి కంపెనీ అధికారుల నివాసాల మీదికి వెళ్ళారు. తుపాకులు, ఫిరంగులు ఎదురయ్యాయి. కాని, వాళ్ళు వెనకడుగు వేయలేదు. తమలో ఆఖరివాడు ప్రాణాలు వదిలే వరకు అచంచలమైన ధైర్యంతో, చెక్కుచెదరకుండా గోడలా నిలబడి పోరాడారు!


సంపుటి: 101    డిసెంబర్ '97    సంచిక : 6

విడిప్రతి : 6-00    సంవత్సర చందా    72-00







Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

**CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG**

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
Chandamama Buildings
Vadapalani, Madras - 600 026.

వార్తలు-విశేషాలు:

# తొలి భారతీయ మహిళా అంతరిక్షగామి

కార్నాల్‌లోని టాగూరు బాలనికేతన్‌లో విద్యాభ్యాసం ప్రారంభించిన కల్పనా చావ్లాకు చిన్నప్పుడు విమానాల బొమ్మలు గీయడంఅంటే ఎంతోఇష్టం. హైస్కూలు చదువు పూర్తయ్యాక ఆమెను డాక్టర్‌కు చదివించాలని తల్లిదండ్రులుఆశించారు. అయితే, ఆమె ఇంజనీరింగ్ చదువుతానని పట్టు బట్టి అంతరిక్షశాస్త్రం (ఏరోనాటిక్స్) ప్రధాన పాఠ్యాంశంగా తీసుకున్నది. అప్పుడామె వయసు 17 సంవత్సరాలు. ఆతరవాత పద్దెనిమిది సంవత్సరాల నిర్విరామ కృషి, పట్టుదల ఫలితంగా ఆమె ఇప్పుడు నవంబర్ 19వ తేదీ మరో ఆరుగురితో పాటు కొలంబియా వ్యోమనౌకలో అంతరిక్షానికి ప్రయాణమ యింది! అంతరిక్షంలోకి అడుగుపెడుతూన్న తొలి భారతీయ మహిళగా; ఆ అవకాశం సాధించిన ఆసియా దేశాలకు చెందిన మొట్టమొదటి వనితగా కల్పనా చావ్లా అందరి దృష్టినీ ఆకర్షించింది!



హర్యానా రాష్ట్రానికి చెందిన కార్నాల్, ఢిల్లీ నగరం శివార్లలోవున్న చిన్నపట్టణం. అక్కడే కల్పనా చావ్లా జన్మించింది. ఏరోనాటిక్స్‌ను ప్రధాన పాఠ్యాంశంగా తీసుకున్న మొట్టమొదటి విద్యార్థిని గానే కాకుండా, ఆమె ఆ విభాగంలో ప్రథమ రాలిగా ఉపాధ్యాయుల మెప్పు పొందింది. డిగ్రీ తీసుకున్న తరవాత పైచదువులకు అమెరికాకు వెళ్ళాలని పట్టుబట్టి వెళ్ళి, అక్కడ ఏరోనాటిక్స్‌లో పరిశోధనలు జరిపి, డాక్టరేట్ సాధించింది. కమర్షియల్ పైలట్‌గావున్న పైరీ హారిసన్‌తో ఆమెకు పరిచయమేర్పడింది. ఆ తరవాత అతన్నే వివాహమాడింది. అతని సహాయంతోనే, తానుకమర్షియల్ పైలట్‌గా లైసెన్స్ పొందింది. 1987వ సం॥లో ఒంటరిగా విమానం నడిపింది!

ఆ తరవాత ఆమె దృష్టి అంతరిక్ష పరిశోధనల మీదికి మళ్ళి, 'నేషనల్ ఏరోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్' (నాసా)లో చేరి త్వరలోనే అందులో ఒక విభాగానికి ఉపాధ్యక్షురాలయింది. అంతరిక్ష గాములకు ఎంపిక జరుగుతున్నదన్న ప్రకటన చూసి, దానికి 1992లో దరఖాస్తు పంపింది. 1994వ సం॥లో మళ్ళీ మరొక దరఖాస్తు పంపింది. దాదాపు 3,000 మంది అభ్యర్థులలో పరీక్షలు జరిపి 19మందిని ఎంపికచేశారు. వారిలో కల్పనా చావ్లా ఒకరు. 1996వ సం॥లో ఆఖరుగా ఎంపిక చేయబడి హూస్టన్ ట్రెనింగ్ సెంటర్‌లో 16నెలలు శిక్షణ పొందింది. అప్పుడే కొలంబియా 88వ ఫ్లైట్‌ను అంతరిక్షంలోకి పంపే ఏర్పాట్లు జరిగాయి. ముగ్గురు అమెరికన్ అంతరిక్షగాములు; జపానుకు చెందిన తొలి మహిళా అంతరిక్షగామి టాకాయ్ దోయ్; ఉక్రేనియా దేశానికి చెందిన మరొక అంతరిక్షగామితో కలిసి ఆమె నవంబర్ 19వ తేదీ కొలంబియా 88 ఫ్లైట్‌లో అంతరిక్షంలోకి బయలు దేరింది.

అంతరిక్షంలో గడిపే 15 రోజులూ వ్యోమగాములు ద్రవాహారాలనే తీసుకోవాలి. రోజుకు 16గంటలు పరిశోధనలతో, నిర్దిష్ట విషయ సేకరణలో గడపాలి. 8 గంటలసేపు వంతుల వారీగా నిద్రపోవాలి.

వ్యోమనౌకలో జరిగే పరిశోధనలకు కల్పనా చావ్లా బాధ్యత వహిస్తున్నది. సూర్యగ్రహాన్ని అధ్యయనం చేయడానికి 'ఫ్రీ ఫ్లైయింగ్ శాటలైట్'ను విడుదల చేస్తుంది. టాకాయ్‌దోయ్‌తో కలిసి అంతరిక్షంలో నడుస్తుంది.

కల్పనా చావ్లా అంతరిక్షయాత్రను మన దేశ ప్రజలందరూ ఎంతో ఆసక్తితో గమనిస్తున్నారు. అంతరిక్షానికి బయలుదేరే ముందు, భారత ప్రతినిధి బృందంతో, "ఇది భారతదేశం గర్వించ తగ్గ సమయం!" అన్నది కల్పనా చావ్లా.



# భేదవతి

చందనపురంలో రామదాసు, లక్ష్మమ్మ అనే పుణ్యదంపతులకు లేకలేక పుట్టింది ఒక ఆడపిల్ల. ఆనందంతో అది కిలకిల మంటూ నవ్వేనవ్వు, వేదపఠనంలా వున్న దని తల్లిదండ్రులామెకు వేదవతి అని పేరు పెట్టారు.

ఒకసారి వేదవతి, తల్లివద్ద పాలుతాగుతూ తన గుప్పెటతో చీరను బలంగా పట్టుకున్నది. తల్లి ఎంత ప్రయత్నించినా, ఆ చీరను విడిపించుకోలేకపోయింది. రామదాసు వచ్చి తనూ ప్రయత్నించాడు కానీ పర్రున చిరిగిన తర్వాతే, చీర చిన్న దాని చేతుల్లోంచి బయటపడింది. ఖరీదైన చీరపాడైనందుకు తల్లి నొచ్చుకున్నది. కానీ మూడు నెలల పసిపాపను ఎవరేమన గలరు? సంగతి విన్నవారు మాత్రం, అంత చిన్నపిల్లచేతుల్లోఅంతపట్టుండడం విశేషమేనన్నారు.

మరొక మూడునెలల తర్వాత వేదవతి పాకుంటూ వెళ్ళి, ఒక బల్లను లాగింది. ఆ బల్ల మీద తాతల కాలం నుంచీ వుంటున్న గాజుజాడీ ఒకటి నేల మీద పడి ముక్కలుముక్కలయింది. నగిషీలో పనితనానికి పేరుబడిన ఆ జాడీ పోయిందని రామదాసు బాధపడ్డాడు. పిల్లకేమీకాలేదని లక్ష్మమ్మ తృప్తిపడింది.

ఇలా వేదవతికి ఏడాది నిండేసరికి, ఇంట్లో ఎన్నో వస్తువులు పాడయ్యాయి. చిన్న పిల్లలుండే ఇంట్లో అలాగే జరుగుతుందని కొందరన్నారు. కానీ వేదవతిని ఏదో దుష్టశక్తి ఆవహించి వున్నదని మరికొందరంటే, రామదాసు నమ్మిహఠయోగి వద్దకు వెళ్ళాడు.

చందనపురానికి రెండూళ్ళవతల వుంటున్నాడు హఠయోగి. ఆయన అష్టసిద్ధులూ సాధించాడట. ఆయనకు తెలి

"వసుంధర"

యని మాయలూ, మంత్రాలూ లేవట. రామదాసు వెళ్ళి తన సమస్య చెప్పుకోగానే హఠయోగి అమితోత్సాహంగా ఆయనతో బయల్దేరి చందనపురం వచ్చాడు. ఆయన తనవెంట మంత్రదండాన్నొకటి తెచ్చుకున్నాడు.

హఠయోగి ఇంటికి రాగానే లక్ష్మమ్మ, వేదవతిని తీసుకుని వచ్చి ఆయనకు చూపించింది. యోగి, వేదవతిని చూసి చాలాముచ్చటపడి, దానితో కాసేపు కబుర్లాడాడు. తర్వాత మంత్రదండాన్ని పక్కనున్న బల్లమీద పెట్టి, "ఈ పిల్ల ముఖంలో తేజస్సు ఉట్టి పడుతున్నది. దీన్ని దుష్టగ్రహాలు పట్టి పీడించే అవకాశమే లేదు," అంటూ రామదాసు దంపతులతో మాట్లాడసాగాడు.

ఈ లోగా వేదవతి బుడిబుడినడకలతో, మంత్రదండం వున్న బల్ల వద్దకు వెళ్ళింది. మంత్రదండాన్ని తీయడానికి ప్రయత్నించబోగా, దండం కిందపడి రెండు ముక్కలైంది.హఠయోగి అదిగమనించి గుండెలు బాదుకుని, "నా మంత్రదండాన్నే రెండు ముక్కలు చేశావంటే, నువ్వు సామాన్యురాలివి కాదు. నిన్నిక వేదవతి కాదు, భేదవతి అనాలి! నేను మాత్రం ఒక్క క్షణం ఇక్కడుండను," అని తన మంత్రదండంముక్కలు తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

అప్పట్నించీ అందరూ వేదవతిని, భేదవతి అనే పిలవసాగారు. తనపేరుకు తగినట్టే ప్రవర్తిస్తూ యుక్త వయస్కురాలైంది భేదవతి.

భేదవతి వ్యవహారం తల్లిదండ్రులకు బెంగపుట్టించేది. అది చెట్టునుంచి కాయ కోస్తే కొమ్మ విరిగేది. మొగ్గ తుంచితే, వేళ్ళతో సహా మొక్క పెకలివచ్చేది. బావి





TL-F-2



నుంచి నీళ్ళు చేదితే, బావిలో పడేదిచేద. ఇల్లూడ్చితే నేలలో గోతులేర్పడేవి. గిన్నెలు తోమితే సొట్టలు పడేవి. ఆరేస్తే చీరలు చిరిగేవి. దాని చేతుల్లో ఎప్పుడూ ఏదో ఒక వస్తువు పాడవడంతో, దానికి పని చెప్పాలంటేనే తల్లిదండ్రులు ఎంతగానో భయపడేవారు.

భేదవతి ఎవరిళ్ళకు వెళ్ళినా, అవతలి వాళ్ళు దానికేసి భయం భయంగా చూసే వాళ్ళు. ఆ కారణం వల్ల, అది స్నేహితురాండ్రతో ఆడుకునేందుకు ఊరి బయటకు వెళ్ళేది.

వేదవతిగా పుట్టి భేదవతిగా పేరుపడ్డ తమ కుమార్తె భావి జీవితం ఎలా వుంటుందోనని తల్లి దండ్రులు బెంగపడసాగారు.

ఇది ఇలా వుండగా – చందనపురానికి ఆమడదూరంలో వున్న మృత్తికాపురంలో వందనుడనే వాడు తలెత్తాడు. వాడికి కొన్ని చిట్కాలు తెలుసు. ఆ చిట్కాలతో వాడు వజ్రాలు దొంగిలిస్తూంటాడు. అదెలాగంటే; వాడు ఒకతరహా మట్టితో, అరచేయి ప్రమాణపు మనిషిబొమ్మను చేసి, వజ్రాల దుకాణానికి వెళతాడు. అక్కడ నేర్పుగా ఒక వజ్రాన్ని కాజేసి, బొమ్మలో దూర్చుతాడు. వజ్రం ఆ మెత్తటి బొమ్మలోచేరాక, బొమ్మకూడా వజ్రమంత గట్టిగానూ మారిపోతుంది. తర్వాత ఆ బొమ్మను భేదించి వజ్రాన్ని తీసుకోవడ మన్నది, వందనుడికి మాత్రమే తెలిసిన విద్య!

ఒకసారి వందనుడు వజ్రపురికి వెళ్ళాడు. అక్కడ వజ్రనాథుడనే ఒక యువకుడి దుకాణంలో, మేలుజాతి వజ్రాలను ఎంపిక చేయడాని కన్నట్టు పరీక్షిస్తూ,ఒక విలువైన వజ్రాన్ని ఒడుపుగా బొమ్మలోకి జొనిపాడు. అది దుకాణంలోని పనివాడొకడు గమనించి, యజమానికి చెప్పాడు.వజ్రనాథుడువచ్చి చూసుకుంటే, ఉండవలసిన వజ్రాల్లో నిజంగానే ఒకటి తక్కువైంది.

"అయ్యా! ఈ బొమ్మ అభేద్యమైన పదార్థంతో చేయబడింది. ఇందులో నేను వజ్రాన్ని జొనిపాననడం హాస్యాస్పదంగా వుంటుంది," అన్నాడు వందనుడు చిరుకోపంగా.

అయితే, వజ్రనాథుడు వాడికేసి అనుమానంగా చూస్తూ, "మా పనివాడు అబద్ధం చెప్పడు. అటుపైన దుకాణంలో వజ్ర

మొక్కటి తక్కువైంది. మేమీ బొమ్మను బద్దలుకొట్టి పరీక్షిస్తే, నీకేమైనా అభ్యంతరమా?" అన్నాడు.

వందనుడు తనకేమీ అభ్యంతరం లేదన్నాడు. అప్పుడు వజ్రనాధుడి దుకాణంలో, ఆ బొమ్మను పగులగొట్టే ప్రయత్నాలు చాలా జరిగాయి. ముందు చేతులతో విరవడానికి ప్రత్నించారు. తర్వాత సుత్తి దెబ్బలు కొట్టారు. ఆ తర్వాత వజ్రాలనుకోసేబలమైనయంత్రాలను ఉపయోగించారు.

బొమ్మ చెక్కుచెదరలేదు!

"ఇంత గట్టి బొమ్మలో వజ్రాన్ని దూర్చడం అసాధ్యం!" అన్నారు కొందరు.

వజ్రనాధుడు మాత్రం, "పోయిన నా వజ్రం ఐదులక్షల వరహాలవిలువచేస్తుంది. ఈ బొమ్మను పగులగొట్టే దాకా, అది ఇందులో లేదంటే నేను నమ్మలేను. ఈ బొమ్మను పగులగొట్టే ఉపాయమే ఉండదా?" అని వాపోయాడు.

అప్పుడే ఆ దుకాణంలో అడుగుపెట్టిన చందనపురం వాస్తవ్యుడొకడు, విషయం విని, "ఈ పని మా భేదవతివల్ల తప్పక అవుతుంది!" అంటూఅక్కడివారికి ఆమె కథ చెప్పాడు.

దుకాణంలోని వాళ్ళది విని, "ఇదేదో పుక్కిటిపురాణంలా వుంది. వినడానికి బాగున్నా వాస్తవంలో సాధ్యం కాదు," అన్నారు. వజ్రనాధుడు మాత్రం, "అలాకొట్టి పారేయకూడదు. ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికెరుక? నా అభిప్రాయంలో, ఈ వందనుడి వద్ద ఏదోచిట్కా వున్నది. ఈ బొమ్మ లోపల వజ్రమున్నదని ఋజువు చేయగలిగితే, ఒక ఆరితేరిన వజ్రాల దొంగను రాజభటులకు పట్టిచ్చిన వాడనౌతాను. ఈ బొమ్మను పగులగొడితే ఆ





భేదవతికి సంతోషంగా లక్షవరహాలు కానుకగా ఇస్తాను," అన్నాడు.

వందనుడు తనూ సవాలు చేస్తూ, "ఈ బొమ్మను భేదవతి కూడా పగులగొట్ట లేకపోతే, వంశపారంపర్యంగా నాకు సంక్రమించిన వజ్రాలను, ఈ వజ్రనాథుడే కొని సరైనధర నాకివ్వాలి," అన్నాడు.

"బొమ్మలోంచి వజ్రం బయటపడితే, నీ ఇంటనున్న వజ్రాలన్నీ నాకే ధారపోయాలి, సరేనా?" అన్నాడు వజ్రనాథుడు.

ఇలా ఒప్పందమైనాక, ఇద్దరూ కలిసి చందనపురం బయలుదేరారు. వాళ్ళు రామదాసు ఇంటికి వెళ్ళి తమ సమస్య చెప్పుకుందామనుకునేలోగానే, ఊరి పొలిమేరల్లో ఆటలాడుతున్న కొందరాడపిల్లలు కనబడ్డారు. వారి మధ్యన భేదవతి చుక్కల్లో చంద్రుడిలా వెలిగిపోతున్నది. ఆమె అందానికి వారిద్దరూ ఆశ్చర్యపడి, వివరాలడిగి ఆమే భేదవతి అని తెలుసుకుని తెల్లబోయారు. ఈ లోపల కొందరు గ్రామస్థులు అక్కడికి చేరారు.

వజ్రనాథుడు తన వద్దవున్న బొమ్మను భేదవతికిచూపించి, "నేను వజ్రనాథుడనే వజ్రాలవ్యాపారిని. ఈ బొమ్మలోపల ఐదు లక్షల వరహాల విలువచేసే వజ్రం వున్నది. ఈబొమ్మనుపగులగొట్టే ఉపాయం దొరక్క గొడవపడుతున్నాం. నువ్వు పగుల గొడితే, లక్షవరహాలబహుమతి ఇస్తాను," అన్నాడు.

ఆ వెంటనే వందనుడు తనెవరైందీ భేదవతికి చెప్పి, "ఇందులో విలువైన వజ్రం ఏదీ లేదని ఋజువైతే, నేనునిన్ను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను," అన్నాడు.

దీనికి భేదవతి కోపంగా, "నాకు తల్లి దండ్రులున్నారు. పెళ్ళిమాటలు వాళ్ళతో మాట్లాడండి. ఆ బొమ్మనిలా ఇవ్వండి. సుత్తి దెబ్బలకూ, యంత్రాలకూ పగులని బొమ్మను నా ఒట్టిచేతులతో పగులగొట్టగలనేమో చూస్తాను!"' అన్నది.

వజ్రనాథుడామెకు బొమ్మనిస్తూంటే, భేదవతి అందుకున్నదికానీ, అది ఆమె చేతులనుంచి జారికిందవున్న బండరాయిమీద పడింది. మరుక్షణం బొమ్మ ముక్కలు ముక్కలై,అందులోంచివజ్రంబయటపడింది.

"అదిగో, నా వజ్రం!" అంటూ వజ్రనాథుడు వజ్రాన్ని తీసుకున్నాడు.

ఆ వెంటనే వందనుడు పెద్దగొంతుతో, "ఇందులో ఏదో మోసం వున్నది! ఇటు

వంటి మోసకారి ధనంకోసం హత్యలు కూడా చేయగలడు," అంటూ అక్కడి నుంచి పారిపోజూశాడు.

అయితే, జనంలోంచి నలుగురు యువకులు ముందుకువచ్చి, వాణ్ణి అక్కణ్ణించి పారిపోకుండా పడిసిపట్టుకున్నారు.

వజ్రనాధుడు, వాళ్ళతో, "వీణ్ణి నగరానికి తీసుకుపోయి, రాజభటులకు అప్పగించండి. వీడింట అక్కడాయిక్కడా దొంగిలించిన వజ్రాలు చాలావున్నవి. ఆ సంగతి వాళ్ళకు చెప్పండి," అన్నాడు.

ఊరిబయట తమ కుమార్తె చుట్టూ జనం పోగయివున్నారనీ, ఏదో గొడవగా వున్నదనీ విన్న భేదవతి తల్లిదండ్రులు రామదాసూ, లక్ష్మమ్మా పరుగు పరుగున అక్కడికి వచ్చారు. భేదవతి వాళ్ళకు జరిగింది చెప్పి, వజ్రనాధుణ్ణి చూపుతూ, "ఆ, మాయదారి బొమ్మను పగలగొడితే, ఈయన నాకు లక్షవరహాలు బహుమతిగా ఇస్తానన్నాడు," అని చెప్పింది.

రామదాసూ, లక్ష్మమ్మలు అవునా అన్నట్టు వజ్రనాధుడికేసి చూసేంతలో, వజ్రనాధుడు వాళ్ళకు నమస్కరించి, "లక్షవరహాలేమిటి! మీకూ మీకూ ఇష్టమైతే, నేను భేదవతినివివాహమాడతాను," అన్నాడు.

ఆ మాటలువింటూనే భేదవతి, తల్లి చాటుకుపోయి నిలబడింది. రామదాసూ, లక్ష్మమ్మలు పరమానందంగా, "అంత కంటేనా, బాబూ! మా భేదవతి చెయ్యి తగిలితే మంత్రదండాలు కూడా ముక్కలు చెక్కలవుతాయి. ఇలాంటి దాన్నిచూస్తూ చూస్తూ పెళ్ళాడే సాహసవంతుడు ఎక్కడ దొరుకుతాడా అని, దిగులుతో కుమిలిపోతున్నాం," అన్నారు.

ఆ తర్వాత కొద్దిరోజులకు వజ్రనాధుడితో భేదవతి వివాహం ఘనంగా జరిగిపోయింది. అయితే, భేదవతి చేతిలో ఆ తర్వాత కూడా ఎన్నో వస్తువులు పాడయ్యాయి. కానీ ఆమెనిప్పుడెవరూ భేదవతి అనడం లేదు. ఆమె ఇప్పుడు ధనవంతురాలుకావడం, అందుకు మొదటి కారణమైతే - ఆ పేరు హేళనగా కాక బిరుదులా ధ్వనించడం రెండో కారణం. కాబట్టి ఇప్పుడామె నందరూ వేదవతి అనే అంటున్నారు.



# తండ్రికితగ్గ కొడుకు!

ఒకానొక గ్రామంలో వుండే బుచ్చయ్య అనే అతణ్ణి చూడటానికి, చాలాకాలం తర్వాత గంగయ్య అనే అతను వచ్చాడు. బుచ్చయ్య మంచి ఆస్తిపరుడు. అతడి తండ్రివ్యవసాయంతోపాటు వడ్లవ్యాపారంలాంటివి కూడా చేసి కొడుక్కు చాలా ఆస్తి మిగిల్చిపోయాడు.

బుచ్చయ్యకు ఒకడే కొడుకు. వాడికి చదువుసంధ్యలేమాత్రం అబ్బక పోగా, మామూలు చిన్నచిన్న పనులు కూడా సక్రమంగా చెయ్యలేని అమాయకుడుగా, మందమతిగా కనిపించాడు గంగయ్యకు.

మాటల సందర్భంలోగంగయ్య, బుచ్చయ్యతో, "మీవాడు మరీ అమాయకుడుగా కనిపిస్తున్నాడు.మంచి గురువునుపెట్టి, ఏదో విధంగా వాడికి చదువుసంధ్యలు నేర్పిస్తే బావుండేది.నీతర్వాత ఇంత ఆస్తిని వాడు ఎలా కాపాడుకోగలడా అని, నాకు అనుమానంగా వున్నది!" అన్నాడు.

దీనికి బుచ్చయ్య చిరుకోపంగా, "గంగయ్యా! చదువుకున్నవాడే తెలివి గలవాడనుకోకు. నేను చదువుకున్నదెంత? మా అబ్బాయి పైకి అలా అమాయకుడిలా కనిపిస్తాడుగాని, తెలివితేటల్లో వాడికి వాడే సాటి. కావాలంటే నువ్వే పరీక్ష చెయ్యి", అన్నాడు.

అప్పుడు గంగయ్య, బుచ్చయ్య కొడుకును దగ్గరకు పిలిచి, "ఒరే, బాబూ! ఇదే ఋతువురా? ఎండాకాలమా, వానాకాలమా? చలికాలమా?"అని అడిగాడు.

"ఆ కాలాల సంగతి నాకు తెలీదు.దుకాణాల్లోఎక్కడ చూసినా మామిడికాయలే!" అన్నాడు వాడు.

ఆ జవాబుకు గంగయ్య చిన్నగా నవ్వి, సరే, "ఆ మామిడికాయలెక్కడనుంచి వస్తవి?" అని ప్రశ్నించాడు.

వాడు వెంటనే, "బుట్టల్లోంచి!" అన్నాడు.

ఆ మరుక్షణం బుచ్చయ్య కొడుకుకేసి కళ్ళురుముతూ చూసి,"గంగయ్యా! నువ్వన్నట్టు వీడుమందమతే! మామిడికాయలు సంతలోనుంచి వస్తవని వాడికి తెలియకపోవడం ఆశ్చర్యం!" అన్నాడు.

తండ్రికి తగ్గ కొడుకు! అని తనలో తాను నవ్వుకున్నాడు గంగయ్య. **– డి. శంభుదాసు**






12

[తన తదనతరం మగధ సింహాసనానికి వారసుడు ఎవరని ప్రకటించకుండానే రాజు బిందుసారుడు మరణించాడు. తక్షశిలకు రాజు మరణవార్త అందినప్పటికీ సుశేముడు అక్కడినుంచి కదలలేదు. అశోకుడు ఉజ్జయిని నుంచి కొంత సైన్యంతో పాటలీపుత్రం చేరుకున్నాడు. తనను హతమార్చడానికి ప్రయత్నించిన ఆరుగురు రాకుమారులను వధించి, ముందుకు వెళ్ళి, పెద్దల కోరిక ప్రకారం తండ్రి చితికి నిప్పంటించాడు. అన్ని విధాలా అర్హుడైన యువరాజుఅశోకుణ్ణే రాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేయాలని ప్రధానమంత్రీ, రాజపురోహితుడూ, సేనాధిపతీ నిర్ణయించారు. —తరవాత]

బిందుసార మహారాజు మరణించాడన్న విచారంతో వున్న మగధ ప్రజలు, రాజ కుమారులు కూడా హతులయ్యారని తెలిసి మరింత విషాదానికి లోనయ్యారు. అయినా రాజకుమారుల మరణానికి వాళ్ళే కారకులనీ, వాళ్ళ దుర్మార్గమే వాళ్ళ నాశనానికి దారి తీసిందనీ గ్రహించి ఊరట చెందారు.

అర్ధరాత్రి సమయంలో ప్రధానమంత్రి అశోకుడికి రాజ్యాధికారం అప్పగించాడు. అశోకుడు సింహాసనం అధిష్ఠించాడు గాని, కిరీటం ధరించలేదు. "ఈ విషాద పరిస్థితిలో రాజ్యాభిషేకానికి నా మనసు అంగీకరించడంలేదు. ఇప్పుడు మకుటాభిషేకోత్సవం వద్దు!" అన్నాడు అశోకుడు.

మంత్రులూ, సేనాధిపతీ అశోకుడి అభిప్రాయాన్ని అభినందించి, అంగీకరించారు. కాని వారిలో ఏ ఒక్కరు గానీ ప్రశాంతంగా ఉండలేకపోయారు. ఎందు



కంటే, తక్షశిల నుంచి రాజుగారి జ్యేష్ఠ కుమారుడు సుశేముడు ఏ క్షణాన వచ్చి ఎటువంటి అఘాయిత్యానికి పూనుకుంటాడో అని దిగులుపడసాగారు.

తక్షశిలలో సుశేముడు, నాట్యకత్తెలు వంచనతో చెప్పిన మాటలనే ఇంకా నమ్ముకుని, అశోకుడు కదలలేని స్థితిలో పడివున్నాడని ఊహించుకుంటూ కాలయాపన చేయసాగాడు. సుశేముడి తల్లి, మళ్ళీ తన కుమారుడికి రహస్యంగా ఒక లేఖ పంపింది. "తండ్రి మరణించాడు. కానీ, నువ్వు ఇప్పుడు పాటలీపుత్రానికి రావద్దు!" అని ఆ లేఖలో ఉన్నది. ఆ లేఖను చదవగానే సుశేముడు ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు. లేఖ తెచ్చిన దూతకేసి ఆగ్రహంగా చూశాడు.

మహారాజు బిందుసారుడి దహన సంస్కారానికి ముందు జరిగిన పోరాటం గురించీ, రాకుమారుల మరణం గురించీ, ఆ తరవాత అశోకుడు రాజ్యాధికారాన్ని చేపట్టిన విషయం గరించీ దూత సుశేముడికి తెలియచెప్పాడు.

"ఆహాఁ! ఎంతఘోరం జరిగిపోయింది! ఆ పరిచారికాపుత్రుణ్ణి ఇక ప్రాణాలతో వదలకూడదు. ఈ క్షణమే నా ఖడ్గంతో తెగనరుకుతాను! పాటలీపుత్రానికి బయలుదేరాలి; దళానాయకులను పిలవండి!" అని కేకవేశాడు సుశేముడు.

"మహారాణిగారు తమర్ని ఇప్పుడే రావద్దని హెచ్చరించారుకదా?" అన్నాడు దూత వినయంగా చేతులు జోడించి.

"నోర్ముయ్!" అని దూతను కిందికి తోసి, "నా మాటకు ఎదురాడకు. నన్ను కాబోయే రాజుగా నా తండ్రి నిర్ణయించాడు కదా? నేను దహనసంస్కారానికి రావడానికి కొంత ఆలస్యమైనంత మాత్రాన మా తండ్రి నిర్ణయాన్నికాదనడానికి, ఆ దుర్మార్గులు ఎవరు? ఇదంతా ఆ గుంటనక్క ఖల్లాటకుడి కుట్ర! ఆనీచుడే నా ఖడ్గానికి మొదటి బలికావాలి!" అంటూ సుశేముడు తోక తొక్కిన త్రాచులా బుస్సున లేచాడు.

☆☆☆

యువరాజు సుశేముడు తక్షశిలలో వున్న సైన్యాన్ని వెంటబెట్టుకుని పాటలీపుత్రంకేసి వస్తున్నాడని తెలియగానే ప్రధాన మంత్రీ, సేనాధిపతీ తీవ్రమైన ఆందోళనకు గురయ్యారు. కర్తవ్యం గురించి చర్చించడానికి అశోకుడు వాళ్ళందరినీ పిలిపిం

చాడు. అందరూ రహస్యాలోచన మంది రంలో సమావేశమయ్యారు. అశోకుడు వారిని, "సుశేముడు సైన్యంతో వస్తూన్న విషయం మీకుతెలిసి వుంటుంది. ఈ స్థితిలో మీసలహా ఏమిటి?" అని అడిగాడు.

ఏ ఒక్కరుగాని నోరు తెరవలేదు. అలముకున్న నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అశో కుడు మళ్ళీ, "మిత్రులారా! మౌనంవహిం చడానికి ఇది సమయం కాదు. మగధ రాజ్య శ్రేయోభిలాషులుగా మీ సలహా కోరుతున్నాను," అన్నాడు గంభీరంగా.

"ప్రభూ! మకుటాభిషేకం ఇప్పుడు వద్దన్నది తమరేతప్ప మేముకాదు. అయినా తమరే మాకు మహారాజు. శత్రువు తన మీదికి దండెత్తి వచ్చినప్పుడు ఒకరాజు ఏంచేయాలో అదే మీరు చేయండి. మహా రాజుగా ఆ నిర్ణయం మీరే తీసుకోవాలి!" అంటూ ప్రధానమంత్రి ఖల్లాటకుడు ఇతర మంత్రులకేసిచూశాడు.

వాళ్ళందరూ ముక్త కంఠంతో, "యుద్ధం తప్పదు!" అన్నారు.

"మీసలహాకు కృతజ్ఞుణ్ణి! అయితే ఒక్క విషయం. నేను సుశేముడికి ఒక అవకాశం ఇవ్వదలచాను," అన్నాడు అశోకుడు.

"ఏమిటది?" అని అడిగాడు ప్రధాన మంత్రి.

"సుశేముడు శాంతంగా తిరిగివెళ్ళిన ట్టయితే తక్షశిలలోఇప్పటిలాగే రాజ ప్రతి నిధిగా కొనసాగవచ్చు!"అన్నాడు అశోకుడు.

"రాజ ప్రతినిధిగా సుశేముడు మీకు లోబడి వుండడం అసంభవం. ఒకవేళ తిరిగి వెళ్ళినా, ఆయన స్వతంత్రం ప్రకటిం



చుకోగలడు. అది మిగిలిన వారిని కూడా తప్పు దారిపట్టించి, రాజ్యంలో అశాంతికి దారితీయగలదని శంకిస్తున్నాను," అన్నాడు ఒక మంత్రి.

ప్రధానమంత్రి కొంతసేపు మౌనంగా ఆలోచించి, "మంత్రిమాటలలో ఏమాత్రం అతిశయోక్తిలేదు. ఆయన ఊహ అక్షరాలా నిజమవుతుంది. అయినా, మన రాజుగారి ఉద్దేశం కూడా చాలా ఉదాత్తమైనది. సుశేముడు శాంతంగా తక్షశిలకు తిరిగి వెళ్ళి, రాజప్రతినిధిగా కొనసాగడానికి అవ కాశం ఇవ్వడంలో తప్పులేదు. ఒకవేళ ఆయన తక్షశిలకువెళ్ళి స్వతంత్రం ప్రకటిం చుకునే ప్రయత్నం చేసినట్టయితే అప్పుడు అవసరమైన చర్యలు తీసుకోవచ్చు!" అన్నాడు.



"ఈ విషయాన్ని సుశేముడికి ముందే తెలియజేయడం ఎలా?" అని అడిగాడు అశోకుడు.

"ఆ పనిని నేనే చేస్తాను. నగరం పొలిమేరలో ద్వారతోరణం ఏర్పాటు చేసి, చేతిలో పుష్పహారంతో సుశేముడికి స్వాగతం చెబుతాను. ఒకరిద్దరు పెద్దలు తప్ప నా చుట్టూ ఆయుధాలు ధరించిన సైనికులెవ్వరూ ఉండకూడదు. మేము యుద్ధానికి సిద్ధంగాలేమనీ, శాంతిమంతనాలకు కాచుకుని ఉన్నామనీ సుశేముడికి అర్థమవుతుంది. ఆయన దగ్గరికి రాగానే పుష్పహారంవేసి తమ ప్రతిపాదనను తెలియజేస్తాను," అన్నాడు ప్రధానమంత్రి.

"మీ ధైర్యాన్నీ, వివేకాన్నీ అభినందిస్తున్నాను. ప్రధానమంత్రీ! అయినా, తమ ప్రాణాలకు ఆపద వాటిల్లుతుందేమోనని భయపడుతున్నాను," అన్నాడు అశోకుడు.

"నేను చేయబోయే పని అపాయకరమైనదే. కాని, యువరాజు నన్ను చంపడం ద్వారా సాధించేదేమీఉండదు. అదిఆయన ప్రాణాలకే ముప్పు అవుతుంది. అయినా, మగధ సామ్రాజ్య రక్షణకూ, శాంతికీ నా ప్రాణాలర్పించడానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు ప్రధానమంత్రి.

"మీ రాజభక్తి శ్లాఘనీయమైనది. మీ సాహసం జయప్రదం కావాలని కాంక్షిస్తున్నాను," అన్నాడు అశోకుడు.

సుశేముడు నగరం శివార్లను సమీపించడానికి ముందే ఖల్లాటకుడు నగర ప్రవేశ ద్వారం దగ్గరికి చేరాడు. సుశేముడు దూరంగా కనిపించగానే చేతిలో పుష్పహారం పట్టుకుని నిలబడ్డాడు.

నగరాన్ని సమీపించే కొద్దీ సుశేముడిలో ఆగ్రహం పెల్లుబకసాగింది. "నేను రాజభవనంలోకి ప్రవేశించి సింహాసనం అధిష్ఠించేంతవరకు మార్గమధ్యంలో ఎవరు అడ్డుపడినా సరే హతమార్చండి!" అని సైనికులను హెచ్చరిస్తూ గుర్రంపై తుపానులా ముందుకు రాసాగాడు.

సుశేముడు ద్వారాన్ని సమీపించగానే ప్రధానమంత్రి పుష్పమాలనుపైకెత్తిస్వాగతం అన్నట్టు అతన్ని ఆపబోయాడు. సుశేముడు ఒక్కక్షణం ఆగాడు. కానిఅంతలోనే, "దుర్మార్గుడా! నువ్వు ఇక్కడే ఉన్నావా?" అంటూ కత్తిదూశాడు.

"యువరాజా! ఆగండి..." అంటూ ప్రధానమంత్రి ఏదో చెప్పబోయాడు. కాని

అంతలోనే సుశేముడి కత్తివేటుకు ఆయన తల తెగి నేలపై పడింది!

ప్రాకారానికి ఆనుకుని వున్న భవనం ఉపరితలం మీద నిలబడి కింద జరిగిన దాన్ని పరిశీలించిన దళనాయకుడు ఆజ్ఞాపించగానే, గోడకు ఆవలనున్న సైనికులు గట్టు తెగిన వెల్లువలా సుశేముణ్ణీ అతని సేనలనూ చుట్టుముట్టారు. దాంతో సుశేముడు ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేకపోయాడు. ప్రధానమంత్రి కుమారుడూ, దళనాయకుడూ అయిన ఒక యువకుడు సుశేముడి తలను తెగనరికాడు! దాంతో తక్షశిలనుంచి వచ్చిన సేనలులొంగిపోయాయి. సైనికులు జరిగినదానికి క్షమాపణలు చెప్పుకుని మగధసైన్యంలోకలిసిపోయారు.

శాంతిని కాంక్షించి, నిరాయుధపాణిగా నిలబడిన ప్రధానమంత్రి ఖల్లాటకుడికి వాటిల్లిన దుర్మరణానికి అశోకుడు విచారించాడు. ఆయన స్థానంలో నూతన ప్రధానమంత్రిగా రథగుప్తుణ్ణి నియమించాడు.

శత్రుశేషం లేకుండా నశించడంతో రాజ్యంలో శాంతి భద్రతలు నెలకొన్నాయి. రాజ్యపాలనలోతమరాజు అశోకుడు తాత చంద్రగుప్తుడంతటి సమర్థుడని వృద్ధులైన ప్రజలు చెప్పుకోసాగారు.

అశోకుడికి మకుటాభిషేకోత్సవం జరపడానికి జ్యోతిష్కులు శుభముహూర్తం నిర్ణయించారు. కాని ఈ విషయంలో పెద్దలకు ఒక సమస్య ఎదురయింది. విదీశాదేవి బౌద్ధమతావలంబిని. ఆమెను మగధ సామ్రాజ్య మహారాజ్ఞిగా అంగీకరించడానికి ఆస్థాన పురోహితులు సుముఖత చూప లేదు. ఎందుకంటే, ఆమెకు హైందవమత సంప్రదాయాలపట్ల విశ్వాసం లేదు. దానికి తోడు ఆమె ఇటీవల అనారోగ్యం పాలయింది. ఆమె చాలా దూరం ప్రయాణం చేయడం అపాయకరమని వైద్యులు సలహా ఇచ్చారు. అలా అని మకుటాభిషేకోత్సవాన్ని మరికొంత కాలం ఆలస్యం చేయడం కూడా సాధ్యపడదు. ఎందుకంటే ఇటువంటి శుభ ఘడియలు మరొక ఐదేళ్ళకుగాని రావని జ్యోతిష్కులు సెల విచ్చారు. రాణిగారు లేకుండా మకుటాభిషేకోత్సవం జరగడానికి లేదు.



ఇవన్నీ ఆలోచించి నూతన ప్రధాన మంత్రి రథగుప్తుడు అశోకుడితో, "ప్రభూ!



తమ విషయంలో ఇంతటి చొరవ చూపుతున్నందుకు క్షమించండి. మహారాణి విదీశాదేవి ఆరోగ్యం అంత బాగాలేదు. పైగా తమ కుమారుడు యువరాజు మహేంద్రుడికికూడాబౌద్ధమతసిద్ధాంతాలనే బోధిస్తున్నారు. యుద్ధంపట్ల విశ్వాసంలేని యువరాజు మునుముందు తమ రాజ్యాన్నిఎలా రక్షించుకోగలడో ఆలోచించండి. రాజ్యం వీరభోజ్యంఅన్నసత్యంతమరెరుగనిదికాదు. రాజ్యం భవిష్యత్తు దృష్ట్యా తమరు వేరొక రాకుమారిని వివాహమాడడం ఒక్కటే తరుణోపాయంగా తోస్తున్నది!" అన్నాడు.

అశోకుడు మంత్రి ఆలోచనకు తల ఒగ్గలేదు. కాని విషయం తెలుసుకున్న విదీశాదేవి యశుడి ద్వారా – తన ఆరోగ్యం క్షీణించిందనీ, ఈ స్థితిలో రాజపత్నిగా తన బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించజాలననీ; వేరొక రాకుమారిని వివాహమాడడమే అన్ని విధాలా శ్రేయస్కరమనీ అశోకుడికి తన ప్రార్థనగా తెలియజేసింది. ఆఖరికి అశోకుడు ద్వితీయ వివాహానికి సమ్మతించాడు. అసంధిమిత్రను వివాహమాడాడు. కొన్నాళ్ళకు, జ్యోతిష్కులు నిర్ణయించిన శుభముహూర్తంలో అశోకుడికి మగధరాజ్య మకుటాభిషేకోత్సవం వైభవోపేతంగా జరిగింది.

అయితే, అశోకుడు విదీశాదేవినీ, ఇద్దరు సంతానాన్నీ మరవలేకపోయాడు. క్రమంగా విచారానికి లోనై రాజ్యపాలనా వ్యవహారాలపట్ల ఆసక్తిని కోల్పోసాగాడు.

అశోకుడి వైఖరిని గురించి ప్రధాన మంత్రి సేనాధిపతిని సంప్రదించాడు. "మన రాజుగారు పెద్దభార్య విదీశాదేవిని గురించి ఆలోచిస్తూ, రాజ్య వ్యవహారాలను సైతం ఉదాసీనం చేస్తున్నాడు. ఇలాగే సాగితే ఆయన హఠాత్తుగా సింహాసనాన్ని త్యజించి ఉజ్జయినికి వెళ్ళి అక్కడ ప్రశాంత జీవితం గడపాలని నిర్ణయించినా ఆశ్చర్యం ఉండదు. ఆయనలో రాజ్యకాంక్షనురగిలించి, అధికార దాహాన్నీ, విజయోత్సాహాన్నీ కలిగించడం మన కర్తవ్యం. యుద్ధాలలో విజయం సాధించినప్పుడే రాజులకు ఆనందోత్సాహాలు సిద్ధిస్తాయి. శత్రురాజులను పరాజితులను చేసి విజయం సాధించడంలో కలిగే ఆనందం అద్భుతమైనది కదా!" అన్నాడు ప్రధానమంత్రి రథగుప్తుడు సేనాధిపతి వీరసింహుడితో.

"మీ అభిప్రాయం సమంజసంగానే ఉన్నది. సమయంచూసి రాజుగారిలో రాజ్యకాంక్షను కలిగించడం అవసరం," అన్నాడు సేనాధిపతి.

ఆ సమయంలోనే వారసుడు లేకుండానే కళింగరాజు మరణించాడన్నవార్తఅందింది. కొందరు అధికారులే పరిపాలనా వ్యవహారాలు చూస్తున్నారు.

ఒకనాటి సాయంకాలం వేళ ప్రధాన మంత్రి, ఉద్యానవనంలో విహరిస్తూన్న అశోకుణ్ణి సమీపించి, "మహారాజా! చంద్ర గుప్త మౌర్యుడూ, బిందుసార మహారాజూ జయించాలని కలలుగని,జయించకుండా వదిలిన రాజ్యం కళింగ ఒక్కటే. బాలీ, సుమత్ర వంటి దూరద్వీపాలతో వర్తక వ్యాపారాలు సాగిస్తూన్న సుసంపన్న రాజ్యం కళింగ. ఒకరాజు కింద వివిధ వంశస్థులైనపాలకులు మైత్రీ సంబంధాలు కలిగి వుండడం వల్ల అక్కడ ఐకమత్యానికి కొదువలేదు. ఇప్పుడు రాజు మరణించాడు గనక, పాలకులమధ్య ఐకమత్యం పటాపంచలుకావడంతథ్యం. కళింగను జయించడానికి ఇదొక సువర్ణావకాశం," అన్నాడు.

సేనాధిపతి కూడా అంతలో అక్కడికి వచ్చాడు.

మంత్రి మాటలకు అశోకుడు సమాధానం చెప్పలేదు. మౌనంగా ఆలోచించ సాగాడు.

"మన సైన్యం చాలా సంవత్సరాలుగా యుద్ధంచేయలేదు. ఇలాగేసాగితే మన సైనికులుసోమరులుగామారిపోయేప్రమాదం వుంది. సైన్యం అంటే తరచూశిక్షణకావాలి. ఇలాగేసాగితే శత్రువులనుఎదిరించే శక్తిని కూడాకోల్పోవచ్చు!" అన్నాడు సేనాధిపతి.

"సరే! కళింగపై దండెత్తడానికి కావలసిన ఏర్పాట్లన్నీచేయండి. మొదట కళింగకు మన గూఢచారులను పంపండి. ఆ రాజ్యంలోని సేనల బలాబలాలను తెలుసుకోవడం వాళ్ళ మొదటి పని! ఆ తరవాత వాళ్ళు అక్కడి పాలకులలో ఒకరిమీద ఒకరికి అనుమానం కలిగే పరిస్థితులను సృష్టించాలి!" అన్నాడు అశోకుడు.

"చిత్తం, ప్రభూ! మీ ఆజ్ఞను శిరసావహిస్తాము!" అన్నాడు ప్రధానమంత్రి.

కళింగపై దండయాత్రకు మగధ సిద్ధం కాసాగింది. - (ఇంకావుంది)






# సన్మానార్హత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, కన్నుపొడుచుకున్నా కానరాని కటిక చీకటిలో, శ్మశానం మధ్య నువ్వు దేనిని సాధించ దలచి ఇన్ని కఠోర శ్రమలకు గురిఅవుతున్నావో తెలియడంలేదు. రాజులకు రాజనీతి విషయాలలో తగు సలహాలిచ్చేందుకు మంత్రులూ, యుద్ధవ్యూహాల్లో తోడ్పడేందుకు సేనాపతులూ, ఐహిక, ఆధ్యాత్మిక చింతనాపరంగా కలిగే సంశయాలను తీర్చేందుకు పండితులూ వుంటారు. నీ ఆస్థానంలో అలాంటి వారికి కొదువవుండదని భావిస్తున్నాను. కాని, వారిలో కొందరు ఒక్కొక్కసారి స్వార్థం కొద్దిగానీ, లేక హేతు, ఆచార విరుద్ధమైన సమస్యను ఏదోవిధంగా

## బేతాళ కథలు



పరిష్కరించి తృప్తి పడదామన్న తాప త్రయం కొద్దీ గానీ చిత్రాతి చిత్రమైన చర్యలకు పాల్పడతారు. అలాంటివారి దుష్ప్రభావానికి, ఒకవేళ నువ్వు లోనయ్యా వేమో అన్న శంక కలుగు తున్నది. అదే నిజమైతే, నీకు హెచ్చరికగా వుండేందుకు, పిట్టయ్య అనే ఒక మూర్ఖుడి కథ చెబు తాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు శతభోజుడనే రాజుండే వాడు. ఆయన కళాప్రియుడు. ఆయన ఆస్థానంలో వివిధ శాస్త్రాల్లో ప్రవీణులైన పండితులెందరో వుండేవారు. శతభోజుడు తానెక్కడికి వెళ్ళినా, పండితులనుకూడా వెంటతీసుకుని వెళ్ళి తీరికవేళల్లో వారితో ముచ్చటించి ఆనందించేవాడు.

ఆ రాజ్యంలోని ప్రలోమగ్రామం ప్రకృతి సౌందర్యానికి పుట్టినిల్లని, అంతా చెప్పు కునేవారు. శతభోజుడు ఒకసారి తన పండితపరివారంతో ఆ గ్రామానికి వెళ్ళి, గ్రామం సమీపంలో గుడారాలు వేయిం చాడు. రాజుకూ, పరివారానికీ అన్ని సదుపా యాలూ చేసేందుకు గ్రామ ప్రముఖులం దరూ ముందుకు వచ్చారు.

ప్రలోమ గ్రామంలో పిట్టయ్య అనే మూర్ఖుడున్నాడు. ప్రపంచంలో తనకు తెలియనిది లేదని వాడు నమ్ముతాడు. వాడితో వాదన లెందుకులే అని, గ్రామం లోని పండితులు కూడా, వాడేమన్నా సహించి వూరుకునే వారు. దానితో పిట్ట య్యకు తనంతవాడు లేడన్న నమ్మకం బలపడింది.

పిట్టయ్యకు ప్రమీల అనే చెల్లెలుంది. చూడ్డానికి దేవలోకంనుంచి దిగివచ్చిన అప్సరసా అనిపిస్తుంది. ఆమెను పెళ్ళాడా లని గ్రామంలోని యువకులు చాలామంది కలలు కంటూండేవారు. వాళ్ళందరూ మంచిమాటలతో పిట్టయ్యను వశపరు చుకోవాలని, వాడిని ఆకాశానికెత్తేస్తూండే వారు. అందువల్లపిట్టయ్యకు గర్వంమరింత పెరిగింది.

శతభోజ మహారాజు గ్రామంచివర గుడా రాల్లో బసచేస్తున్నాడనీ, ఆయన వెంట ఉద్దండపండితులు వచ్చారనీ పిట్టయ్యకు తెలిసింది. వాడు వెంటనే వెళ్ళి పండిత పరివారాన్ని కలుసుకుని వారితో, "అయ్య లారా! మాగ్రామ పండితులందరూ నన్ను మించిన పండితుడులేడని ఒప్పుకున్నారు.

మా గ్రామ యువకులు నాకు బ్రహ్మరథం పడుతున్నారు. జీవితంలో ఇంత సాధించినా, నాలో ఒక కోరిక మిగిలిపోయింది. మీవంటి రాజాస్థాన పండితుల నుంచి సన్మానంపొందాలన్నదే ఆకోరిక!" అన్నాడు.

పండితులు వాడు చాలా గొప్పవాడనుకుని, వాణ్ణి తమకు తెలిసిన శాస్త్రాలనుంచి ప్రశ్నలు వేసి పరీక్షించారు. వాటికి వాడిచ్చిన సమాధానాలువిని, "నువ్వు పరమ మూర్ఖుడివి. నిన్ను ఆటపట్టించడానికే అందరూ నిన్నుపొగుడుతున్నారు," అనిహేళనచేశారు.

పిట్టయ్యకు కోపం వచ్చింది. "ఇంత వరకూ నన్నెవరూ పరీక్షించనూలేదు,ఇలా హేళన చెయ్యనూలేదు. నేను మిమ్మల్ని సన్మానించమన్నాను కానీ ప్రశ్నలడగమనలేదు కదా! ఈమాత్రం ఇంగితం లేని మిమ్మల్ని రాజెలా ఆస్థానంలో చేర్చుకున్నాడో నాకు అర్థం కాకుండా వున్నది," అన్నాడు.

పండితులువాడిమాటలకు కోపం తెచ్చుకోకుండా, "నాయనా, నీ ఈ సందేహాన్ని తీర్చడం మావల్లకాదు. పక్క గుడారంలో మహారాజుగారున్నారు. ఆయన్నే అడుగు," అన్నారు.

ఆ విధంగా పిట్టయ్య రాజదర్శనం చేసుకుని, శతభోజుడి అందమైన రూపానికి అచ్చెరువు చెంది, "ప్రభూ! తమరింత బాగున్నారు. తమ ఆస్థానంలో అలాంటి పండితులనెలా చేర్చుకున్నారు?" అని అడిగాడు.

ఆ మాటలతోనే వాడు తెలివితక్కువ వాడని అర్థం చేసుకున్న శతభోజుడు,



"నా పండితుల్లో నీకు కనబడిన లోపమేమిటో చెప్పు?" అన్నాడు ఎంతో కుతూహలంగా.

"వాళ్ళు నాకు సన్మానం చేయడానికి నిరాకరించారు. అదేవాళ్ళ లోపం. తమరు వాళ్ళకు బుద్ధిచెప్పి, నాకుసన్మానంచేయించండి. లేదావాళ్ళను ఆస్థానంలోంచి తొలగించండి," అన్నాడు పిట్టయ్య.

"నేను నువ్వు చెప్పినట్టు చెయ్యననుకో ఏంచేస్తావు?"అన్నాడు శతభోజుడు, వాడిని రెచ్చగొడుతూ.

దీనికి జవాబేమివ్వాలో వెంటనే తోచలేదు పిట్టయ్యకు. వాడు ఆలోచనలోపడగానే, శతభోజుడుహేళనగానవ్వుతూ,"చెప్పు, ఆలోచిస్తావేం? నీమాటలు వినకపోతే, నువ్వు నన్నేంచెయ్యగలవు?" అన్నాడు.

అప్పుడప్పుడు ఇలాగే ప్రశ్నించి గ్రామం లోని యువకులు పిట్టయ్యను ఉడికిస్తూం డేవాళ్ళు. అలాంటప్పుడు పిట్టయ్య వాళ్ళకు తన చెల్లెల్నిచ్చి పెళ్ళి చెయ్యనని బెదిరిం చేవాడు. వాళ్ళు చప్పున వాడు చెప్పినట్టు వినేవారు.ఆవిషయం గుర్తుకొచ్చి పిట్టయ్య, "నేనేం చేస్తానో చెప్పను; ఏం చెయ్యనో చెబుతాను. దెబ్బకు మహారాజైనా దిగిరా వలసిందే!" అన్నాడు.

"పోనీ, అదే చెప్పు," అన్నాడు శతభో జుడు.

"నా చెల్లెల్ని మీకిచ్చి పెళ్ళి చెయ్యను," అన్నాడు పిట్టయ్య. శతభోజుడికీ బెది రింపు వినగానే నవ్వొచ్చింది. అయితే, ఇలాంటి మూర్ఖుడి చెల్లెలెలా వుంటుందో, ఆమెతో మాట్లాడితే ఇంకెంత వినోదం లభిస్తుందో అన్న ఉద్దేశంతో ఆయన, "ఒకసారి నీ చెల్లెల్నిచూస్తాను. తర్వాత నీ సన్మానం విషయం ఆలోచిస్తాను. సరేనా?" అన్నాడు.

ఇందుకు పిట్టయ్య ఒప్పుకున్నాడు. శతభోజుడు వాడితోకలిసి వెళ్ళి, ప్రమీలను చూసి, అప్సరసలను తలదన్నే ఆమె అందానికి దిగ్భ్రాంతుడయ్యాడు. ఆమెతో కొద్దిసేపు మాట్లాడగానే, ప్రమీలకు అన్న లాంటి మూర్ఖత్వం లేదనీ, ఆమెకు లోక జ్ఞానం బాగా వున్నదనీ రాజుకు అర్థమ యింది.

"నీవంటి అందగత్తె మహారాణి కావడమే న్యాయం. నన్ను పెళ్ళాడ్డం నీకిష్ట మేనా?" అన్నాడు శతభోజుడు.

పిట్టయ్య మధ్యలో కలగజేసుకుని, "ప్రభూ, తమ ఆస్థానపండితులచేత నాకు సన్మానంచేయిస్తేనే, ఈ పెళ్ళి జరుగుతుం దని, ముందే మనవి చేశాను. తమకు అంగీకారమే కదా!" అని ప్రశ్నించాడు.



శతభోజుడు చిరాకుపడి, "మా ఇద్దరికీ ఇష్టమైతే, మధ్య నువ్వెవడివి? కావాలంటే కోరినంత డబ్బిస్తాను, తృప్తిపడు. పిచ్చి పిచ్చి కోర్కెలు కోరి ప్రాణాలమీదికి తెచ్చుకోకు," అన్నాడు.

ప్రమీల,రాజునువారించి,"ప్రభూ!అతడు స్వయానా నాకు అన్న. అతడు కోరిందిఏమంతపెద్దకోరికాకాదు; తమకుఅసాధ్యమూ కాదు. నేనుమిమ్మల్ని సంతోషంగా వరించాలంటే ఈమాత్రం చెయ్యలేరా?" అన్నది.

శతభోజుడికామె మాటలు న్యాయమనిపించి, సరే నన్నాడు. తరవాత గుడారానికి తిరిగి వెళ్ళి పరివారాన్ని పిలిచి, జరిగింది చెప్పి, "ప్రమీలను తొలిచూపులోనే వరించాను. మా ఇద్దరికీ వివాహం జరగాలంటే, మీ సహకారం కావాలి," అన్నాడు.

పండితులందరూ ముఖముఖాలు చూసుకున్నారు. పిట్టయ్య వంటి పరమ మూర్ఖుడికి, తమవంటివారు సన్మానం చేస్తే,తమపాండిత్యాన్నీ,శతభోజుడి కళాపోషణనూ ప్రపంచమంతా హేళన చెయ్యదా? ఒక ఆడదానికోసం రాజు ఇంతగా దిగజారడం, అన్నివిధాలా అవమానకరం కాదా?

పండితులు, రాజుకు ఆ పని తమ వల్ల కాదనీ, రాజు గనక కాదుకూడదంటే, తాము ఆస్థాన పదవులకు నీళ్ళు వదులుకోగలమనీ చెప్పారు.

శతభోజుడు, పండితులనేమీ అనలేక, ప్రమీలను వదులుకోలేక, మనసులోనే దుఃఖపడసాగాడు.

ఈ విషయం ప్రమీలకు తెలిసింది.ఆమె పండిత పరివారానికి కబురు పెట్టి,వాళ్ళు తన ఇంటికి రాగానే, "మీరు మహాపండితులని విన్నాను. మీపాండిత్యం మీరాజుకు పనికిరాక పోవడం చిత్రంగా వున్నది," అన్నది.





అందుకు పండితులు ఆశ్చర్యపడి, "మా పాండిత్యం రాజుకు అన్ని విధాలా పనికివస్తున్నది. మూర్ఖుడి చెల్లెలితో వివాహానికి మాత్రమే పనికిరాకుండా వున్నది!" అన్నారు.

"ఎందువల్ల?" అని అడిగింది ప్రమీల.

"ఈ వివాహం జరగాలంటే, మేము మీ అన్న పిట్టయ్యను సన్మానించవలసి వున్నది. అనర్హుడిని సన్మానించడం పండిత ధర్మంకాదు," అన్నారు పండితులు.

"నా అన్న అర్హుడే అని నేను ఋజువు చేస్తాను. అప్పుడు మీరతడికి సన్మానం చేస్తారా?" అన్నది ప్రమీల.

"నీఅన్నకు ఏజ్ఞానమూ లేదు. ఏ ఆధారంతో అతడి సన్మానార్హతను ఋజువు చేయగలవు?" అని అడిగారు పండితులు.

ప్రమీల నవ్వి, "నా అన్న అర్హతను ఋజువు చేయడానికి, అతడికేజ్ఞానమూ అవసరం లేదు. నాకున్న లోకజ్ఞానం చాలు!" అన్నది.

తర్వాత ఆమె వారికి, తనను వివాహమాడదలచిన యువకులు దేశదేశాలు తిరిగితెచ్చిన కానుకలను చూపింది. అవన్నీ వేర్వేరు పెట్టెలలో వున్నాయి.

ఒక పెట్టెలో వేపపుల్ల వున్నది. దాన్ని ప్రశాంతదేశంనుంచి తెచ్చాడొక యువకుడు. అక్కడ చందనం ఎంతసమృద్ధిగా వుంటుందంటే, వంట చెరకుగా చందనం కర్రనే వాడతారు. ఆ దేశంలో ఎక్కడో కానీ వేప చెట్టు కనబడదు. వేపపుల్ల అక్కడ ఎంతో విలువైనది.

మరొకపెట్టెలో రాగి ఉంగరం వున్నది. ఆ దేశంలో బంగారు గనులు ఇన్నీ అన్నీ కావు! వంటపాత్రలక్కూడా అక్కడ బంగారాన్నే వాడుతూ, ఆభరణాలకు మాత్రం రాగిని వాడతారు. రాగి నగలు త్వరగా పాడవుతాయని, అలా జరక్కుండా లోహ మిశ్రమాలు కూడా కనిపెట్టారక్కడ. రాగిలో కొద్దిగా బంగారాన్ని కలిపిన మిశ్రమంతో తయారైనదే, ఆ రాగి ఉంగరం. ఈ దేశంలో బంగారు ఉంగరం కన్నా, ఆ దేశంలోని ఈ రాగి ఉంగరం విలువ ఎక్కువ.

ఇంకొక్క పెట్టెలో అందంగా కనబడే నల్లటి బొగ్గుస్ఫటిక మున్నది. ఆ దేశం నిండా వజ్రాలేకావడం వల్లనూ, మసిబొగ్గు తక్కువగా లభించడంవల్లనూ, ఈ స్ఫటికాలకక్కడ చెప్పలేనంత విలువ వున్నది.

ఈ విధంగా ప్రమీల పండితులకు ఎన్నో వస్తువులు చూపింది. పట్టుబట్టల కంటే విలువైన నేత దుస్తులూ, కళా ఖండాల కంటే ఎక్కువ విలువను సంత రించుకున్నవంకరటింకరగీతల చిత్రాలూ ఇలా ఎన్నో ప్రమీలవద్ద చూసి, పండితులు అచ్చెరువు చెంది, "ఈ విశేషాలు మేము ఆనోటా ఈనోటా వినివున్నాము.కానీ ప్రత్య క్షంగా నీవద్దనే చూస్తున్నాము! నువ్వు చాలా అదృష్టవంతురాలివి," అన్నారు.

"మీరంతా మహాపండితులు. ఇకనైనా నా అన్న విలువను గుర్తించి, అతడికి సన్మానం చేయండి. మహారాజుతో నా వివాహం జరిపించండి," అన్నది ప్రమీల.

"నీ మాటలు చిత్రంగా వున్నాయి. ఈ వస్తువులన్నీ చూడడం వల్ల, నీ అన్నకు సన్మానార్హత ఏవిధంగా వస్తుందో, నువ్వే వివరించు," అన్నారు పండితులు.

అప్పుడు ప్రమీల వాళ్ళకు చేతులు జోడించి, "అయ్యలారా! మీరు పండి తులు, ప్రాజ్ఞులు. నన్ను పరీక్షించడానికే మీరిలా అడుగుతున్నారు తప్ప, ఈపాటికి మీకంతా అర్థమయ్యేవుంటుందని నేను నమ్ముతున్నాను," అన్నది.

వెంటనేపండితులు ఆలోచనలో పడ్డారు. ఒకటి రెండు క్షణాలు గడిచేలోపల, ఒక వృద్ధపండితుడు మందహాసం చేస్తూ, చేయెత్తి ప్రమీలను దీవించి, "అమ్మా! నీమాటలతో, మాలో మహాపండితుల మన్న అహంకారం వుంటే అది నశించింది. మూర్ఖుడికి సన్మానం ఏమిటా అన్న విషయం గురించి, మేము సూక్ష్మంగా



తర్కించి వుంటే, మన మహారాజుకు క్షణకాలం కూడా మనస్తాపం కలిగివుండేది కాదు. మూర్ఖుడి సన్మానార్హత గురించి, నీలాగా ఇంతవరకూ ఎవరూ చమత్కరించి వుండలేదు. నీ వంటి తెలివైన యువతి, ఈదేశానికిమహారాణికావడం ప్రజల అదృ ష్టమనే ఉద్దేశంతోకూడా, మేము నీఅన్నను సన్మానించదలచాం!" అంటూ మిగతా పండితులకేసి చూశాడు.

పండితులందరూ, ప్రమీల తనకు లభించిన వింతకానుకలను చూపించడం ద్వారా చెప్పదలచినదేమిటో, అప్పటికి అర్థమైనట్టు తలలూపి, కరతాళ ధ్వనులు చేశారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మూఢత్వంకూడా సన్మానార్హమని భావించే

శతభోజుడి ఆస్థాన పండితుల గురించి ఏమను కోవాలి? తమ రాజు ప్రమీలను వివాహ మాడదలచి, అది సాధ్యంకాదేమో అన్న మనస్తాపంలో వున్నందున, ఆయ నకు సంతోషం కలిగించేందుకు వాళ్ళు, మూర్ఖుడైన పిట్టయ్యను సన్మానించదలచి నట్టు కనబడుతున్నది. మూర్ఖత్వాన్ని సన్మానించడమంటే, పాండిత్యాన్ని అవమా నించి నట్టేకదా? ఏది ఏమైనా, సమస్యను పరిష్కరించి తీరాలన్న తొందరపాటు కొద్దీ పండితులు, హేతు, ఆచార విరుద్ధ మైన, ఈ అసంగతానికి పాల్పడినట్టు తెలియడం లేదా? ఇంతకూ, ప్రమీల తన వద్ద వున్న వింతకానుకల ద్వారా పండితులకేమైనా చెప్పదలచిందా? లేక కేవలం వాళ్ళను గజిబిజి పరిచేందుకు వేసిన ఎత్తుగడా? వృద్ధపండితుడు, ఆమె ఏదో చమత్కరించిందనడం, మిగతా వాళ్ళు తలలూపి కరతాళ ధ్వనులు చేయడం– అంతా హాస్యాస్పదంగా లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "లోకంలో అరు దైన ప్రతిదీ, మనిషిని ఆకర్షిస్తుంది. ఆక ర్షణ అంటే మెచ్చదగిందీ, విలువైనదీ అనే గదా! ఆయా దేశాల్లో అత్యంత విలువైనవీ, తన దేశంలో గుడ్డిగవ్వకు కొరగానివీ అయిన వస్తువులను పండితు లకు చూపించడం ద్వారా, ప్రమీల చమ త్కరించిం దేమంటే– ఎంతో అరుదైన మహాపండితుడిలాగే, వజ్రమూఢుడు కూడా సన్మానార్హుడని. ఇది గ్రహించిన వృద్ధ పండితుడికి తాము పిట్టయ్యను సన్మా నించడం ద్వారా అతడు పరమ మూఢుడని ధృవీకరిస్తున్నట్టు అర్థమైంది. అందువల్లనే, ప్రమీల వంటి వివేకవతి తమకు రాణి అయితే ప్రజలు మరింతగా సుఖపడతారని భావించాడు.

ఆపద్ధర్మంగా – హేతు, ఆచార విరుద్ధ మైనా పండితులందరూ పిట్టయ్యను సన్మానించడానికి తలలూపారు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: జొన్నలగడ్డ రామలక్ష్మి రచన]



## సముద్రతీర ప్రయాణాలు - 26

# సుందర్‌బన్స్ – అండమాన్ నికోబార్ దీవులు

రచన: మీరానాయర్ ◆ చిత్రాలు: గౌతమ్‌సేన్




కలకత్తానుంచి కొంతదూరం ముందుకు వెళ్ళామంటే అచ్చీపుట్ (అచ్చీపూర్) చేరుకుంటాం. 1840వ సం॥ ప్రాంతంలో చైనా దేశస్థులు ఇక్కడికి వలసవచ్చి స్థిరపడ్డారు. అచ్చీపుట్‌ను చైనాటౌన్ అని కూడా పిలుస్తారు.

గంగానది హుగ్లీ పేరుతో బంగాళాఖాతంలో సంగమించడానికి ముందు దక్షిణంగా మలుపు తిరిగి డైమండ్ హార్బర్ సమీపంలో వెడల్పుగా మారి ఉప్పుకయ్యలను ఏర్పరుస్తున్నది. ఒకప్పుడు ఇక్కడ ఈస్ట్ఇండియా కంపెనీ నౌకలను లంగరు దించి ఆపేవారు. ఇప్పుడు ఉప్పు కయ్యల చుట్టూ జనాన్ని తీసుకు వెళ్ళడానికి ఉపయోగించే మోటారు లాంచీలనూ, నాటు పడవలనూ ఆపడానికి దీనిని ఉపయోగిస్తున్నారు.

హార్బరుకు దక్షిణంగా పలు పాయలుగా చీలే గంగానదీ; దానికి తూర్పుగా శాఖోపశాఖలై సముద్రంలో సంగమించే బ్రహ్మపుత్ర కలిసి ప్రపంచంలోనే అతిపెద్ద డెల్టా ప్రాంతాన్ని ఏర్పరుస్తున్నది. బ్రహ్మాండమైన ఈ నదులు కొట్టుకువచ్చే రేగడి మన్ను కారణంగా డెల్టా తూర్పు ప్రాంతంలో కొత్త లంకలూ, దీవులూ ఏర్పడుతూ ఉంటాయి. అదే సమయంలో ప్రధాన భూభాగాన్ని సముద్రం అలలు హరించేస్తూ ఉంటాయి.

కలకత్తా నుంచి బంగాళాఖాతం కేసి వెళ్ళామంటే సగం దూరం నుంచి డెల్టా ప్రదేశంలో చిత్తడి నేలలో పెరిగిన అడవులు తూర్పుగా బంగ్లాదేశ్ వరకు వ్యాపించి ఉన్నాయి. ఈ అడవులు దాదాపు 15,500 చ.కి.మీ. విస్తరించి ప్రపంచంలోని పెద్ద మాంగ్రూవ్ అడవులుగా ప్రసిద్ధిగాంచాయి.

**తలల వెనక తొడుగులు ధరించిన మత్స్యకారులు**



ఈ అడవులను **సుందర్‌బన్స్** అని అంటారు. దీనికి సుందరమైన అడవులనీ, లేదా సుందరీ వృక్షాలు విరివిగా వున్న అడవులనీ అర్థం చెప్పుకోవచ్చు. సుందర్‌బన్స్ వల్ల కలకత్తా నగరానికి ప్రాణవాయువు లభిస్తున్నది. ఇవి కలకత్తా నగరానికి సహజమైన కోటగా కూడా ఉంటున్నాయి. ఈ అడవులే గనక లేకుంటే కలకత్తా నగరాన్నీ, చుట్టుపక్కల భూప్రాంతాన్నీ బంగాళాఖాతం బలమైన తరంగాలు కబళించి వుండేవని శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

శీతాకాలం రాత్రుల్లో సుందర్‌బన్స్‌లోని చెట్లమీద కోట్ల కొద్ది మిణుగురు పురుగులు చేరి, ఆ అడవి ఉపరితలంలో వింతశోభను కలిగిస్తాయి. బురదనీటినుంచి గాలి కోసం పైకి లేచిన చువ్వల్లాంటి పొడవాటి చెట్ల మధ్యగా పడవలు నడుస్తూంటాయి. సుందరి, గొరాన్, గెర్వా, ధుండాల్ వంటి జాతుల చెట్లూ కేవా తుంగ జాతి మొక్కలూ ఈ చౌటి నేలలో పుట్టి పెరగగలుగుతున్నాయి.

రాయల్ బెంగాల్ టైగర్స్ అనే పెద్ద పులులు, భయంకరమైన మొసళ్ళు, సొరచేపలు, ఉడుములు, తాబేళ్ళు, పాములు, చేపలు, పీతలు, నత్తలు, తేనెటీగలు మొదలైన అనేకానేక చిన్న పెద్ద జంతుజాలం ఈ అడవులలో నివసిస్తున్నాయి. ఇలా ఇన్ని జాతుల జంతువులు ఒకేచోట నివసించే ప్రాంతాలు ప్రపంచంలో చాలా అరుదుగా కనిపిస్తాయి.

రావిచెట్లను పోలిన ఈ మాంగ్రూవ్‌అడవులలో దాదాపు 300-500 పెద్ద పులులు ఉన్నాయి. ప్రపంచంలో ఒకేచోట అత్యధిక సంఖ్యలో పులులు ఇక్కడే వున్నాయి. చాలా దూరం నీళ్ళలో ఈదగలగడం ఈ పులుల ప్రత్యేకత.



రాయల్ బెంగాల్ టైగర్స్

తేనెసేకరించడానికీ, చేపలు పట్టడానికీ ఈ అడవులలోకి ఈ ప్రాంతాలలో నివసించే వేటగాళ్ళు వెళుతూ వుంటారు. పులులను ఎదుర్కోవడం; వాటి బారి పడకుండా తప్పించుకోవడం వీరి వృత్తిలో ఎదురయ్యే సర్వసాధారణమైన ఆటంకం. వీళ్ళు తలకు వెనక మనిషి ముఖం గల తొడుగులను ధరిస్తారు. తనను చూస్తున్నారని తెలిస్తే పులి మీదికి ఉరకడానికి భయపడుతుందని వాళ్ళు అలా చేస్తారు. వేటకు అడవిలోకి వెళ్ళేముందు పులిదేవుడూ, అడవి దేవుడూ అయిన దక్షిణీరాయ్‌ని ప్రార్థించి మరీ బయలుదేరుతారు.

ప్రభుత్వం సంరక్షిత ప్రాంతంగా ప్రకటించడానికి పూర్వం ఇక్కడి అడవుల నిర్మూలం ఎక్కువగా జరిగింది. హ్యాలిడే, సజ్నాకాళీ, లోధియాన్ దీవులు సంరక్షిత వన్యప్రాంతాలుగా ప్రకటించబడ్డాయి. 1972వ సం॥లో 'ప్రాజెక్ట్‌టైగర్' అనే పులుల సంరక్షణా పథకాన్ని ప్రారంభించారు. పులుల వేటను నిషేధించి వాటి రక్షణకు చర్యలు తీసుకున్నారు. మాంగ్రూవ్ అడవులను 'నేషనల్ పార్క్' గానూ 'టైగర్ రిజర్వ్' గానూ 1984వ సం॥లో ప్రకటించారు. ప్రపంచంలో శాస్త్రీయ పద్ధతిలో సంరక్షించ

బడుతూన్న మొట్టమొదటి మాంగ్రూవ్ అడవి సుందర్‌బన్స్. దీనిని ప్రపంచ 'వారసత్వ ప్రాంతంగా' ప్రకటించారు.

గంగా ముఖద్వారంలోని సుందర్‌బన్స్‌లో వున్న 102 దీవులలో ముఖ్యమైనది **సాగర్‌ద్వీప్.** మాంగ్రూవ్ చెట్ల గుబుర్లను తొలగించడం వల్ల ఈ దీవి ఏర్పడింది. ఈ ద్వీపం అంటే రవీంద్రనాథ టాగూర్‌కు చాలా ఇష్టం. ఈ ద్వీపంలో ఉన్నప్పుడే ఆయన పలు సంగీతప్రధాన గీతాలనూ ప్రసిద్ధిగాంచిన కొన్ని లేఖలనూ రాశాడని చేబుతారు.

ద్వీపం దక్షిణాగ్రాన్ని **గంగాసాగర్** అని అంటారు. మకర సంక్రాంతి (జనవరి 14) నాడు పవిత్ర గంగాస్నానం చేయడానికి లక్షలాది మంది ఇక్కడికి చేరుతారు. గంగా స్నానానంతరం సుప్రసిద్ధమైన 'కపిల్‌ముని' ఆలయాన్ని దర్శిస్తారు. ఈ సందర్భంగా మూడురోజుల పాటు ఉత్సవం (మేలా) జరుగు తుంది.

ఈ ద్వీపంలో 1821వ సం॥లో నిర్మించిన లైట్‌హౌస్ ఇంకా పనిచేయడం విశేషం. ఇది సముద్రమట్టానికి ఇరవై ఆరు మీటర్ల ఎత్తులో ఉన్నది. వాతావరణం నిర్మలంగా ఉన్న రాత్రులలో దీని కాంతి సముద్రంలో 16కి.మీ. వరకు కనిపిస్తుంది.

కలకత్తాకు వెయ్యి కి.మీ. దూరంలో బంగాళాఖాతంలో **అండమాన్ నికోబర్ దీవుల** రాజధాని పోర్ట్‌బ్లాయిర్ ఉన్నది. మన దేశ తూర్పుతీరానికి సమాంతరంగా అండమాన్ నికోబార్ దీవులు వ్యాపించి ఉన్నాయి. సన్నటి చిన్న చిన్న దీవులు ద్వారతోరణంలాగా ఒంపుగా దాదాపు 780 కి.మీ. దూరం విస్తరించి ఉన్నాయి. ఉత్తరాగ్రంలో వున్న ల్యాండ్‌ఫాల్ ద్వీపం, మియాన్‌మార్ (బర్మా)కు 190 కి.మీ. దూరంలోనూ, దక్షిణాగ్రంలోని గ్రేట్‌నికోబార్ దీవి ఇండొనేసియాకు 150 కి.మీ. దూరంలోనూ ఉన్నాయి.

'అండమాన్' అనే పేరు హనుమాన్ నుంచి వచ్చిందని చెబుతారు. ఈ దీవులను ప్రాచీన కాలం నుంచి ఎరిగివున్న మలేసియా ప్రజలు హనుమాన్‌ను 'హండమాన్' అనేవారు. ఈ దీవిని కూడా

**గంగాసాగర్ కపిల్‌ముని ఆలయ సమీపంలో**





అండమాన్ తీరం

ఆ పేరుతోనే పిలిచేవారు. అదే క్రమేణా అండమాన్‌గా రూపాంతరం చెందిందని అంటారు.

**నికోబార్** దీవులను ప్రాచీన కాలంలో 'నక్కావరం' అనేవారు. ఇక్కడి ఆదిమ తెగల ప్రజలు బట్టలు లేకుండా 'నగ్నంగా' తిరగడం వల్ల దీనికాపేరు వచ్చి వుండవచ్చు. 15వ శతాబ్దంలో ఈ దీవులలో అడుగుపెట్టిన పోర్చుగీసులు దీనిని 'నాకుబార్' అన్నారు. అదే క్రమేణా నికోబార్ అయింది.

బ్రిటిష్ పాలనా కాలంలో ఉత్తర అండమాన్స్‌లో జైళ్ళు నిర్మించారు. 1857వ సం॥ సిపాయిల కలహంలో పాల్గొన్న వేలాదిమంది సిపాయిలనూ, ఆ తరవాత రాజకీయ ఖైదీలనూ అక్కడికి తరలించారు. ఆ కాలంలో ఆ దీవులంటే అందరూ హడలిపో యేవారు. అక్కడ త్రాగు నీరు కూడా ఉప్పగా,నల్లగా ఉండడం వల్లా,ఎక్కడా పైరు పచ్చలు లేక పోవడం వల్లా దానిని 'కాలా పానీ' అని చెప్పుకునే వారు.

భారతదేశం స్వాతంత్ర్యం పొందాక ఆ అపోహలన్నీ తొలగి పోయాయి. ఒక దశాబ్దం లోగా అంటే, 1956 నవంబర్ 1వ తేదీ అండమాన్ నికోబార్ దీవులు భారత కేంద్రపాలిత ప్రాంతాలయ్యాయి.



అండమాన్ మత్స్యకారులు




# గోవిందయ్య తెలివి

గోవిందయ్య అనే ఆయన మిఠాయి దుకాణం పెట్టి బాగా గడించాడు. రత్న మాల అతడి ఒక్కగానొక్క సంతానం. ఆ పిల్లను పెళ్ళాడేవాడు, గోవిందయ్య వ్యాపా రానికి కూడా వారసుడవుతాడు గనుక, చాలామంది ఆయనతో వియ్యమందాలని ఆశపడసాగారు.

గోవిందయ్య కూడా తగిన సంబంధం వెతికే ప్రయత్నంలో, లింగయ్య అనే అతడి కొడుకును గురించి విచారించాడు. ఆ కుర్రవాడు తగినవాడని నిశ్చయించు కున్న తర్వాత, లింగయ్యతో మాట్లాడుతూ, "అయ్యా, ఒక చిన్న మనవి! సంబంధం నిశ్చయించుకోబోయేముందు, వరుడికి ఒకపూట, మాఇంట విందుభోజనం పెట్ట వలసిందిగా, ఒక సాధువు నన్ను ఆదేశిం చాడు.ఆ కుర్రవాడు మా అమ్మాయికి తగినవాడైనదీ లేనిదీ, అతడి భోజనం అయిన మరుక్షణం నాకు స్ఫురింప జేస్తాననీ, ఆ ప్రకారం చేస్తే అంతాశుభమే జరుగుతుందనీ చెప్పాడు," అన్నాడు.

గోవిందయ్య మాటలకు లింగయ్య ఆశ్చర్యపడి, అయినా అందులో నష్టపో యేదేం లేదు గనక, కొడుకును గోవిం దయ్యఇంటికి భోజనానికి పంపాడు.

గోవిందయ్య, ఆ కుర్రవాణ్ణి మిట్టమ ధ్యాహ్నంవేళ దాకా కబుర్లుచెబుతూ కూర్చో బెట్టి, అప్పుడు షడ్రసోపేతమైన భోజనం పెట్టించాడు. భోజనం ముగిసిన వెంటనే ఆయన, ఆ కుర్రవాడితో, "నాయనా, నువ్వు మా అమ్మాయిని పెళ్ళాడడం మేలుకాదని, నాకు తోస్తున్నది. ఆమాటే మీనాన్నగారితో చెప్పి, నన్ను మన్నించ మన్నానని కూడా చెప్పు," అన్నాడు.

లింగయ్య కొడుకు నిరాశపడినా, చేసే దేమీ లేక మౌనంగా వెళ్ళిపోయాడు.

లక్ష్మీగాయత్రి



ఆ తర్వాత మరొక ముగ్గురు కుర్రవాళ్ళ కూ్కడా గోవిందయ్య విందుభోజనంపెట్టి, తగినవాళ్ళు కాదంటూ తిప్పి పంపెయ్యడం జరిగింది.

ఒకనాడు గోవిందయ్య ఆప్తమిత్రుడు రాధాకృష్ణయ్య, గోవిందయ్యను కలుసు కుని, "ఏమిటి, గోవిందయ్యా! పెళ్ళి కొడుకులందర్నీ ఇంటికి పిలిచి విందు భోజనాలు పెడుతున్నావట! ఏమిటి సంగతి?" అంటూ ప్రశ్నించాడు.

గోవిందయ్య సరదాగా నవ్వుతూ, "తగిన అల్లుడు దొరికేదాకా, ఈ రహస్యం ఎవరి దగ్గరా వెల్లడించరాదని సాధువు మరీ మరీ చెప్పాడు. కాస్త ఓపికపట్టు!" అన్నాడు.

రాధాకృష్ణయ్య కూడా నవ్వుతూ, "సరేలే, అలాగే కానీ! అయితే, వెంకటాపురంలో నా చెల్లెలున్నది చూడు, దాని మూడో కొడుకు అన్ని విధాలా, మీ అమ్మాయికి తగిన వాడని, నిన్ననే నాకు స్ఫురించింది. మరి వాడికి విందుభోజనం పెడతావోమాన తావో నీ ఇష్టం," అన్నాడు.

"అమ్మమ్మ! విందుభోజనం పెట్టిన తర్వాతే మరో ఆలోచన! ఆ కుర్రవాడు బాగుంటాడనుకుంటే, రేపే మనిద్దరంవెళ్ళి విందుకుపిలుద్దాం,"అన్నాడుగోవిందయ్య.

ఇందుకు సరేనన్నాడు రాధాకృష్ణయ్య. మర్నాడే ఇద్దరూ వెంకటాపురం వెళ్ళి, సంబంధంమాట్లాడి ఆకుర్రవాణ్ణి విందుకు ఆహ్వానించారు. పెళ్ళికొడుకు రమేశుడి తల్లీ తండ్రీ ఆశ్చర్యపోతూనే, కొడుకును గోవిందయ్యతో పంపడానికి అంగీకరిం చారు.

రమేశుణ్ణి వెంటబెట్టుకుని తమ ఊరు చేరాక, గోవిందయ్య అతడితో, "నాయనా! ఈ రాత్రికి మీ మేనమామ ఇంట పడు కుని, రేపు ఉదయాన్నే మా ఇంటికి వచ్చెయ్యి," అని చెప్పి, మిత్రుడితో, "పెళ్ళికొడుకును వెంటబెట్టుకుని నువ్వూ విందుకు రా," అని ఆహ్వానించాడు.

రాధాకృష్ణయ్య అంగీకరించి, మర్నాడు ఉదయం రమేశుణ్ణి వెంటబెట్టుకుని గోవిందయ్య ఇల్లు చేరాడు. వచ్చిన వాళ్ళిద్దర్నీ ముందుగదిలో కూర్చోబెట్టి కబుర్లు ప్రారంభించాడు గోవిందయ్య. అలా చాలాసేపు గడిచాక, "ఏమిటి గోవిందయ్యా! ఆకలి మండిపోతున్నది ఇంకా వంటకాలేదా?"అంటూప్రశ్నించాడు రాధాకృష్ణయ్య.

గోవిందయ్య నొచ్చుకుంటూ, "విందు భోజనంతయారీ కదా, కాస్త ఆలస్యమవుతుంది. ఈ లోగా చెరో లోటా పాలు పుచ్చుకోండి," అన్నాడు.

వెంటనే రమేశుడు ఆయన్ను వారిస్తూ, "భోజనానికి ముందు ఏదైనా తినడం గాని, తాగడం గాని నాకు అలవాటు లేదండీ! మామయ్యగారికి కావలిస్తే పాలు తెప్పించి ఇవ్వండి," అన్నాడు.

రాధాకృష్ణయ్య కూడా మేనల్లుడి మాటలతో కాస్త మొహమాటపడి, "నాకూ ఏమీ వద్దులే!" అనేశాడు. మరొక అరగంట దాటాక భోజనాలకు పిలుపు వచ్చింది. మూడు రకాల తీపి వంటకాలు, మూడు రకాల కారపు వంటలు, కూరలు, పచ్చళ్ళు, అప్పడాలు, వడియాలతో, నిండుగా వున్న మూడు విస్తళ్ళు వాళ్ళకు కనిపించాయి. గోవిందయ్య వాళ్ళిద్దర్నీ కూర్చోమని, తనూ ఒక విస్తరి ముందు కూర్చున్నాడు. రాధాకృష్ణయ్య మిత్రుడి పక్కన చతికిలబడ్డాడు.

అయితే, రమేశుడు మాత్రం కూర్చోకుండా, "పదార్థాలు చాలా ఎక్కువగా వడ్డించారు. అన్నీ తినడం నావల్ల కాదు. ముందే కొన్ని తీసెయ్యమనండి!" అన్నాడు.

"అదేమిటయ్యా? రాళ్ళు తిని అరిగించుకోవలసిన వయసువాడివి!" అంటూ గోవిందయ్య అభ్యంతరం చెప్పబోయాడు.

కాని, రమేశుడు చిరునవ్వు నవ్వి, "మితాహారం తీసుకునే అలవాటు జీర్ణశక్తిని ఎక్కువకాలం కాపాడుతుంది. ఇది మీకు తెలియని సంగతికాదు," అన్నాడు.



అప్పుడు గోవిందయ్య చెప్పగా రత్నమాల వచ్చి, రమేశుడి విస్తరిలో కొన్ని పదార్థాలు తీసేసింది. చెప్పినట్టే సమతూకంగా భోంచేస్తూ, ముందుగా భోజనం ముగించాడు రమేశుడు.

భోజనాలయ్యాక గోవిందయ్య, రమేశుడికీ, భుక్తాయాసంతో వగరుస్తున్న రాధాకృష్ణయ్యకూ తమలపాకులు అందిస్తూ, "ఇంతకూ పదార్థాల రుచి నీకు నచ్చినట్టు లేదు!" అన్నాడు రమేశుడితో.

రమేశుడు వెంటనే జవాబు చెప్పడానికి కాస్త మొహమాటపడి, చివరకు మూడు నాలుగు రకాల పదార్థాలు అంత ప్రశస్తంగా లేవనిచెబుతూ, వాటిలో ఏయే మార్పులు చేస్తే బాగుంటుందో కూడా వివరించాడు.

అంతా విని గోవిందయ్య పరమానంద పడుతూ, "రాధాకృష్ణయ్యా, ఈకుర్రవాడే, మాఅమ్మాయికి తగినవాడని సాధువు నా చెవిలో చెబుతున్నాడయ్యా!" అన్నాడు.

రాధాకృష్ణయ్య ఆయాసపడుతూనే, "సాధువు పేరుచెప్పి, నువ్వే ఏదో ఆలోచిస్తున్నావని గ్రహించాను. అదేమిటో చెప్పు ముందు!" అని అడిగాడు.

గోవిందయ్య పెద్దగా నవ్వి, "రాధాకృష్ణయ్యా! నేనుచేసేది మిఠాయిల వ్యాపారమని నీకు తెలుసుగదా! వాటి మధ్య కూర్చుని వ్యాపారం చేసేవాడికి ముఖ్యంగా వుండవలసినవి, చక్కని ఆహారపుటలవాట్లు. అవి మీ మేనల్లుడికున్నవి. అటువంటివాడు నా వ్యాపారాన్ని అంది పుచ్చుకుంటే, ఇటు రుచికరమైన పదార్థాలను చేయిస్తూ, లాభసాటిగా వ్యాపారం చెయ్యగలడు. అటుదుకాణంలో కూర్చుని చేతికందినవల్లా తింటూ, ఆరోగ్యం పాడుచేసుకోకుండా వుండనూ గలడు. నాకు నచ్చిన కుర్రవాళ్ళలో, నేను పరీక్షించినది అదే! ఇన్నాళ్ళకు భగవంతుడి దయవల్ల, ఈ రమేశుడు నాకు లభించాడు. ఇంక నా కూతుర్నీ, వ్యాపారాన్నీ కూడా అతడిచేతుల్లో పెట్టి నిశ్చింతగా బతుకుతాను," అన్నాడు.

మిత్రుడి మాటలు ఆశ్చర్యంగా విన్న రాధాకృష్ణయ్య, "ఇంతకూ అల్లుడి ఎన్నిక అంతా నీ ఇష్టమేనా! అమ్మాయి అంగీకారం కనుక్కోవద్దూ?" అని ప్రశ్నించాడు.

దానికి గోవిందయ్య, "మీ భోజనాలు అయి, మీరు ముందు గదిలో కూర్చున్నప్పుడు, నేను లోపలికి వెళ్ళింది రత్నమాలకు నాఅంగీకారంతెలియజేసి, దాని ఇష్టాఇష్టాలు కనుక్కుందామనే! నాకూతురుకు ఈసంబంధంఇష్టమే. పోతే, తనకు ఇష్టమో కాదో చెప్పవలసింది అతడే!" అన్నాడు.

రాధాకృష్ణయ్య, మేనల్లుడి కేసి చూసి, "నువ్వేమంటావు?" అని అడిగాడు.

వెంటనే రమేశుడు, "ఎంతయినా ఇట్టే ఆలోచించగల సమర్థులు గోవిందయ్య గారిని కాదని ఎలాఅంటాం,మామయ్యా?" అన్నాడు.

"ఆహాఁ, కాబోయే అల్లుడిచేతే పొగిడించుకుంటున్నావు, తెలివంటే నీదేనయ్యా గోవిందయ్యా!" అంటూ రాధాకృష్ణయ్య నవ్వుతూ మిత్రుణ్ణి అభినందించాడు.



అంగ్లేయులను ఎదిరించిన యోధులు

④

# పాలెగార్ల తిరుగుబాటు

రచన: మీరా ఉగ్రా ◆ చిత్రాలు: గౌతమ్‌సేన్

1798 అక్టోబర్‌లో పాంచాలన్‌కురిచ్చి పాలెగారు వీరపాండ్య కట్టబొమ్మన్‌ను ఉరితీసిన తరవాత కంపెనీ అధికారులు కాస్త ఊరట చెందారు.













మన పాలెగారు మరణిం
చాడు. చిన్న కత్తులు కూడా మన
దగ్గర ఉంచుకోకూడదు. మనల్ని
ఎవరు రక్షిసారు?
సెవతయ్యా, ఊమదురై
కాపాడగలరు. వాళ్ళింకా బతికే
ఉన్నారు.
వాళ్ళను మనం
జైలు నుంచి
విడిపిద్దాం.


వీరపాండ్య కట్టబొమ్మన్ ఇద్దరు సోదరులు, పదిహేను మంది బంధువులు పాళయంకోటలో బందీలుగా ఉన్నారు. పల్లెప్రజలు అక్కడికి చేరారు.


చిన్న వ్యాపారుల్లా వేషాలు వేసుకుని
ఖైదీలకు కావలసిన
పత్రాలను, ఇతర పూజా
ద్రవ్యాలనూ తెచ్చాము.


పూజాద్రవ్యాల మోపులలో ఆయుధాలు దాచి పంపారు. సూర్యా
స్తమయం తరవాత -


దిగ్భ్రాంతులైన కాపలాభటులను సులభంగా లొంగ
దీసుకుని, ఖైదీలు తప్పించుకుని పారిపోయారు.

సెవత్తయ్యను పాంచాలన్ కురిచ్చి కొత్త పాలెగా రుగా ప్రకటించారు. ప్రజలు ఆయన్ను అనుస రించారు.




శివగంగకు చెందిన మరుదుపాండ్యన్, దిండుగల్ గోపాల నాయకుడు, మలబారుకు చెందిన కేరళవర్మ మరికొందరు సంస్థానాధీశులు వాళ్ళతో కలిశారు.







సెవత్తయ్య విజయాలను గురించి విని ఆశ్చర్యం చెందిన కోలిన్ మెకాలే తిరునెల్వేలి నుంచి బయలుదేరి వెళ్ళి పాంచాలన్‌కురిచ్చిని ముట్టడించాడు.




ఊమైదురై మనుషులు అచంచలమైన ధైర్యంతో పోరాడారు. మెకాలే వెనుదిరిగి వెళ్ళాడు.

కాని జయించలేకపోయాడు. 1801 మార్చ్ 31వ తేదీ మళ్ళీ ముట్టడించాడు. ఈసారికూడా మెకాలే వెనుదిరిగి వెళ్ళక తప్పలేదు.



 













మరుదుపాండ్యన్ను అతని సోదరుడువెళ్ళయ్ పాండ్యన్ను వాళ్ళ కుమారులనూ మనుమలనూ బంధించి చంపారు. అదేవిధంగా గోపాలనాయకుడు వంటి ఎదురు తిరిగిన పాలెగార్లు కూడా హతులయ్యారు. 1801 నవంబర్ 16వ తేదీ సెవత్తయ్య, ఊమదురై పాంచాలన్ కురిచ్చిలో మరణశిక్ష పొందారు.






ఉత్తరుడు కౌరవసేనలను జయించి గోవులను మళ్ళించటానికి సహాయపడిన వాడు ఎవరో దేవుడని విని విరాటరాజు, "నాకు ఇంతమహోపకారంచేసిన ఆ దేవుడుఎవరోగదా!ఆయననుచూసి, పూజించాలని నాకు కోరికగా ఉన్నది," అన్నాడు.

దానికి ఉత్తరుడు, "ఆ దేవకుమారుడు అక్కడే అంతర్థానమయ్యాడు. రేపుగాని, ఎల్లుండి గాని ఆయన మనకు దర్శనమిస్తాడు,"అన్నాడు. ఆ దేవకుమారుడు నపుంసకుడి ఆకారంలో తన ఎదటనే ఉన్న సంగతి విరాటరాజు ఎరగడు.

విరాటుడు అనుమతించిన మీదట అర్జునుడు కురువీరుల తలగుడ్డలను ఉత్తరకు ఇచ్చేశాడు.

తరవాత ఉత్తరుడూ, ధర్మరాజూ, అర్జునుడూ జరగవలసిన దాన్ని గురించి ఏకాంతంగా మాట్లాడుకున్నారు.

ఇది జరిగిన మూడోనాడు పాండవులు అయిదుగురూ, కాలకృత్యాలు తీర్చుకుని, చక్కగా స్నానం చేసి, తెల్లని బట్టలుకట్టుకుని, విరాటుడికొలువుకూటానికివచ్చారు. వాళ్ళు రాజులు కూచునే ఆసనాలలో కూర్చున్నారు.

కొంత సేపటికి విరాటుడు రాచకార్యాలుచూడటానికి సభాస్థలానికి వచ్చి, ఉన్నతాసనాలలో కూర్చునిఉన్న పాండవులను చూసి ఒక్కక్షణం నివ్వెరపోయి, మరుక్షణం ఆగ్రహావేశుడై ధర్మరాజుతో, "ఏమయ్యా, నిన్ను నాతో జూదం ఆడటానికి గదా పెట్టుకున్నాను? సింహాసనం మీదకూర్చున్నావు ఎందుచేత?" అని అడిగాడు.

విరాటుడు పరాచకాలాడుతున్నాడనుకున్నవాడిలాగా అర్జునుడు ఆశ్చర్యం ప్రకటిస్తూ, "రాజా, ఈ మహాత్ముడు

43. ఉత్తర వివాహం



ఇంద్రుడి అర్ధాసనం మీద కూర్చోవటానికి కూడా అర్హుడే. ఈచిన్న గద్దెమీద కూర్చోదగడా? ఈయన ధర్మస్వరూపుడు. మహాబలశాలి. రాజర్షి. మనువులాగా లోకాన్ని రక్షించగలవాడు. ఈయన కురుదేశాన్ని పాలించేటప్పుడు, ఈయన వెనక పదివేల గజ బలమూ, ముప్పైవేల రథాలూ ఉంటాయి. శకుని కర్ణులు అండగా గల దుర్యోధనుడే ఈయన బలాన్ని తలుచుకుని దిగులుపడతాడు. అటువంటి ఈయన ఈ సింహాసనం మీద కూర్చోవటానికి తగడా?" అన్నాడు.

విరాటుడీ మాటలకు నివ్వెరపోతూ, "ఈయన కుంతీదేవి పెద్దకొడుకైన ధర్మరాజా? అయితే, ఈయనతమ్ములైన భీమార్జున నకులసహదేవు లేరీ? ద్రౌపది ఏదీ? వారి జాడ ఏమాత్రమూ తెలియ రాలేదే," అన్నాడు.

దానికి అర్జునుడు, "వల్లవుడనే పేరుతో నీదగ్గిర వంటవాడుగా ఉన్నవాడుభీముడు. గంధర్వులను జయించి, ద్రౌపది కోసం సౌగంధిక పుష్పం తెచ్చినవాడు. ఇతనే కీచకుణ్ణి హతమార్చిన గంధర్వుడు. ఆపని మరొకరివల్ల అవుతుందా? నీ గుర్రాలను చూస్తూ వచ్చినవాడు నకులుడు. గోవులను పాలించినవాడు సహదేవుడు. ఈ ఇద్దరూ మహారథులు. నీ సైరంధ్రి ద్రౌపది. నేను అర్జునుణ్ణి. రాజా, నీ చాటున మాకు అజ్ఞాతవాసం సుఖంగా గడిచింది," అన్నాడు.

పాండవులు ఈ విధంగా బయటపడి పోయిన మీదట ఉత్తరుడు అర్జునుడు యుద్ధంలో చూపిన పరాక్రమాన్ని వర్ణించి చెప్పాడు. అతను అర్జునుణ్ణి గురించి చెబుతూ, "సింహం జింకలను తరిమి చంపినట్టు ఈయన కౌరవ యోధులను వేటాడాడు. ఈమహావీరుడు ఒక్కబాణంతో ఏనుగును చంపటం నేను చూశాను. ఈయన శంఖం పూరించేసరికి శత్రువులతోపాటు, నా చెవులూగడియలు పడిపోయాయి," అన్నాడు.

అది విని విరాటుడు, "నిజమే. ఇప్పుడు పాండవులను మనం మంచి చేసుకోవాలి. అందుకోసం మన ఉత్తరను అర్జునుడికి ఇచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు.

"ముందు మనం పాండవులందరినీ గొప్పగాసన్మానించవలసిఉన్నది," అన్నాడు ఉత్తరుడు.

దానికి విరాటుడు, "అవును. యుద్ధంలో నేను ఓడిపోయి సుశర్మకు చిక్కినప్పుడు నన్ను విడిపించి, మనకు విజయం సాధించి పెట్టినవాడు భీముడు. పాండవుల సహాయంతోనే మనం గెలిచాం. అందుచేత మనం పాండవులపెద్ద అయిన ధర్మరాజును సుముఖుణ్ణి చేసుకోవాలి. మనం తెలియక ఏమేమో పేలి ఉంటాం. అదంతా ధర్మరాజు క్షమించాలి," అన్నాడు.

ఇలా అని విరాటుడు ధర్మరాజుకు తన రాజ్యం, ఖజానా, రాజధానీలతోసహా సమర్పించి, పాండవులనందరినీ మళ్ళీమళ్ళీ కౌగలించుకున్నాడు.

తరవాత ఆయన ధర్మరాజుతో, "మీరు క్షేమంగా వనవాసం గడిపి, అమిత కష్టమైన అజ్ఞాతవాసాన్నిగడిపారు. నారాజ్యాన్ని అర్జునుడికి ఉండనివ్వండి. అతనికి నాకూతురైన ఉత్తరనుఇచ్చి పెళ్ళిచేస్తాను," అన్నాడు.

ధర్మరాజు అర్జునుడి కేసి చూశాడు. అర్జునుడు విరాటుడితో, "రాజా, నీకుమార్తెను నేను కోడలుగాచేసుకుంటాను. మన వంశాలమధ్య ఇలా సంబంధం ఏర్పడటం ఎంతైనా మేలు," అన్నాడు.

అది విని విరాటుడు ఎక్కడలేని ఆశ్చర్యం కనబరుస్తూ అర్జునుడితో, "నా కుమార్తెనుభార్యగాస్వీకరించటానికి అభ్యంతర మేమిటి?" అన్నాడు.

"రాజా, నేను నీ కుమార్తెను చాలా కాలంగాచూస్తున్నాను. ఆమె నన్ను తండ్రిగా చూసుకుంటున్నది. అదీగాక నేను ఆమెకు నాట్యాచార్యుణ్ణి. నా కొడుకు అభిమన్యుడు కృష్ణుడి మేనల్లుడు. చిన్నవాడే అయినా అస్త్రాలు తెలిసిన వీరుడు. నీ కుమార్తెకు తగిన వరుడు," అన్నాడు అర్జునుడు.

విరాటుడు తృప్తిపడి, "సరే, నీ ఇష్టం ప్రకారమే చేస్తాను. నాతోటి సంబంధం





నీకు అన్ని విధాలా అచ్చివచ్చు గాక!" అన్నాడు.

పెళ్ళి ఎప్పుడు జరగవలసినదీ ధర్మరాజు నిర్ణయించాడు. విరాటుడూ, అర్జునుడూ మొదలైనవారు కృష్ణుడికి కబురు చేశారు.

అజ్ఞాతవాస సంవత్సరం పూర్తికాగానే పాండవులు విరాటనగరం విడిచి, మత్స్య దేశంలోనే ఉపప్లావ్యం అనే చోటికి మారి, అక్కడ బస చేశారు. అక్కడికి పాండవుల హితులు సైన్యాలతో సహా వచ్చి చేరారు. కాశీరాజూ, శైబ్యుడూ చెరొక అక్షౌహిణీ సేనతోనూ వచ్చారు. ద్రుపదుడూ, ద్రౌపది కొడుకులైన ఉప పాండవులూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ ఒక అక్షౌహిణీ సేనతో వచ్చారు. విరాటుడు ద్రుపదమహారాజుకుఎదురువెళ్ళి,పూజించి, సగౌరవంగా తీసుకువచ్చాడు. ఇలా అనేక మంది రాజులు ఉపప్లావ్యం చేరారు.

ద్వారక నుంచి అభిమన్యుణ్ణీ, ఇంద్ర సేనుడు మొదలైనపాండవ భృత్యులనూ వెంటబెట్టుకుని కృష్ణుడూ, బలరాముడూ, కృతవర్మా, యుయుధానుడూ, సాత్యకీ, అక్రూరుడూ, సాంబుడూ మొదలైనవారు రథాలలో వచ్చి చేరారు.

విరాటుడి ఇంట శంఖాలూ, భేరీలూ మొదలయినవి మోగాయి. అక్కడ విరా టుడు పాండవులను పూజించాడు. తాగ టానికి చెరుకురసం అందించారు. సుధేష్ణ వెంట అంతఃపుర స్త్రీలు చక్కగా అలంక రణలు చేసుకుని, ఉత్తరను పెళ్ళికూతు రుగా అలంకరించారు.

ఉత్తరను అభిమన్యుడికి భార్యగా స్వీక రించటానికి అర్జునుడూ, ధర్మరాజూ అంగీకరించిన మీదట వారిద్దరికీ, అర్జు నుడు కృష్ణుణ్ణి తన వెంట ఉంచుకుని, వివాహం జరిపించాడు.

అభిమన్యుడి పెళ్ళి జరిగిన మర్నాడు పాండవులు అతిథులందరితోనూ కలిసి విరాటుడి సభాభవనంలో సమావేశమ య్యారు. సభ మధ్య విరాటుడూ, ద్రుప దుడూ, మరి కొందరు వయసు మళ్ళిన రాజులూ కూర్చున్నారు. సభలో వసు దేవుడూ, సాత్యకీ, బలరాముడూ, కృష్ణుడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, అభిమ న్యుడూ, ఉపపాండవులూ, పాండవులూ, విరాటుడి కొడుకులూ ఉన్నారు.

కొంతసేపు కబుర్లు చెప్పుకున్నాక, కృష్ణుడు అందరినీఉద్దేశించిఇలాఅన్నాడు:

"శకుని ఆడిన మాయజూదంలో ఈ ధర్మరాజు ఓడిపోవటమూ, ఇతని రాజ్యాన్ని దుర్యోధనుడు మోసంతో కాజెయ్యటమూ మీ కందరికీ తెలుసు. బల పరాక్రమాలతో రాజ్యం సంపాదించుకోగలిగి ఉండికూడా ఈ పాండవులు మాటకు కట్టుబడి, మహా భయంకరమైన వనవాసం పన్నెండేళ్ళు చేశారు. అంతకన్నా కూడా కష్టమైనది అజ్ఞాతవాసం. ఇది కూడా వారు జయప్రదంగా ముగించారు. ఏడాది పాటు వీరు దాస్యంలో గడిపారు. ఇకముందు జరగవలిసినదేమిటో మీరు నిర్ణయించండి. అది ధర్మరాజుకూ, దుర్యోధనుడికీ కూడా నచ్చేదిగానూ, కీర్తికరంగానూ ఉండాలి, ధర్మసమ్మతంగాకూడా ఉండాలి. ఈ ధర్మరాజు అధర్మంగా స్వర్గాధిపత్యం వచ్చినా పుచ్చుకోడు. ధర్మం ప్రకారం ఒక చిన్న పల్లెను ఏలుకోమన్నా ఏలుకుంటాడు. ఆయన ఎప్పటికీ ధృతరాష్ట్రుడి కొడుకుల మంచేకోరుతాడు. పాండవులు తమ స్వశక్తి చేత జయించుకున్న రాజ్యాన్నే ఇప్పుడు కోరుతున్నారు. ఉభయ పక్షాలవారూ అన్నదమ్ముల బిడ్డలే గనక ఉభయ పక్షాలకూ మేలు జరిగే మార్గం ఆలోచించండి. దుర్యోధనుడు న్యాయంగా వీరి రాజ్యం వీరికిస్తే సరే, అలాకాక మళ్ళీ మోసానికి దిగితే పాండవులు ధృతరాష్ట్రుడి కొడుకులను ఒక్కపెట్టున చంపేస్తారు. దుర్యోధనుడే బలవంతుడనీ, పాండవులు బలహీనులనీ అనుకో నవసరం లేదు. ఇంతకూ దుర్యోధనుడి అభిప్రాయం ఎలాఉన్నదీ తెలియరాలేదు. అది తెలియకుండా ఏ నిర్ణయంగాని చెయ్యటం సాధ్యం కాదు. కాబట్టి, దుర్యోధనుడి ఉద్దేశం తెలుసుకోవటానికి ఇక్కడి నుంచి ఒక దూతను, కులీనుడూ, జాగరూకుడూ అయిన వాణ్ణి





పంపితే బాగుంటుంది. ఆ దూతవెళ్ళి, దుర్యోధనుడికి తగిన విధంగా చెప్పి, పాండవులకు అర్ధరాజ్యం ఇచ్చేటట్టు ఒప్పించి వస్తాడు గాక!"

తరవాత బలరాముడు కృష్ణుడి అభిప్రాయాన్ని బలపరుస్తూ, "ఇక్కడి నుంచి వెళ్ళే దూత భీష్మణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ, ద్రోణుణ్ణీ, అశ్వత్థామనూ, కృపుణ్ణీ, శకునినీ, ఇతర కౌరవముఖ్యులనూ, కర్ణుణ్ణీ కలుసుకుని, వారికి కోపం రాకుండా మంచిగా మాట్లాడి, పని పూర్తి చేసుకురావాలి. నిజానికి శకునితో జూదం ఆడటం ధర్మరాజుదేతప్పు. శకుని పాచికల ఆటలో సాటిలేనివాడు. ధర్మరాజు ఆసభలో ఇంకెవరితో ఆడినా గెలిచి ఉండే వాడే. ఆడినవాడు ఆవేశంకొద్దీ తనకున్న దంతా పణంగాపెట్టాడు. ఇందులో శకుని చేసిన మోసం ఏమీ లేదు. అందుచేత ఇక్కడి నుంచి వెళ్ళే దూత దుర్యోధనుడి అనుగ్రహం సంపాదించాలి," అన్నాడు.

బలరాముడిలా అనే సరికి సాత్యకికి అమితమైన ఆగ్రహం కలిగింది. అతను చప్పున లేచి, బలరాముణ్ణి నిందిస్తూ, "నీ అంతరాత్మకు తగినట్టే మాట్లాడావు. అందుచేత నీ మీద నాకు కోపం లేదు. కాని నీ అర్థంలేని మాటలు వింటూకూర్చున్న ఈసభను చూస్తే నాకు మండిపోతున్నది. జూదంలో ప్రావీణ్యం లేని ధర్మరాజుచేతవాళ్ళు బలవంతాన ఆడిస్తే అది వారికి న్యాయమైనగెలుపు ఎలా అయింది? ధర్మరాజు ఇంటికి వారువచ్చి జూదమాడి గెలిస్తే అది న్యాయమైన విజయం అయేది. ఏమైనా, జూదంలో ఓడినందుకు పాండవులు ప్రతిజ్ఞపాలించి వనవాసమూ, అజ్ఞాతవాసమూ చేశారు గద. ఇప్పుడు ధర్మరాజు తన రాజ్యం తానుకోరటానికి యాచించవలసిన పని ఏమిటి? ఏవిధంగానైనా వీళ్ళ రాజ్యం కాజెయ్యాలన్న దురుద్దేశం గల దుర్యోధనాదులు ధర్మమార్గం అవలంబిస్తారనే మాట అబద్ధం. మేమంతా వాళ్ళను హతమార్చి ధర్మరాజుకు రాజ్యాభిషేకం చేస్తాం. ధృతరాష్ట్రుడు జాలి తలిచి ఇచ్చే రాజ్యం ధర్మరాజుకు అవసరం లేదు. అయినా ధర్మరాజు అభిప్రాయం తెలుసుకోకుండా ఏమీ చెయ్యవద్దు," అన్నాడు.

తరవాత ద్రుపదుడు మాట్లాడుతూ, "సాత్యకి చక్కగా చెప్పాడు. మంచి మాట

లకు కరిగి దుర్యోధనుడు రాజ్యం ఇవ్వ డన్నది నిజం. ధృతరాష్ట్రుడికి తన కొడుకును శాసించే శక్తి లేదు. భీష్మ ద్రోణులు దుర్యోధనుణ్ణి అనుసరించవలసిన దుస్థితిలో ఉన్నారు. కర్ణుడూ, శకునీ మూర్ఖులై దుర్యోధనుణ్ణి సేవిస్తున్నారు. మనం పంపే దూత పని సాధించుకు రావాలంటే కేవలం మంచిగా మాట్లాడి లాభం లేదని నా నమ్మకం. మంచిగా మాట్లాడటం దుర్యోధనుడి దృష్టిలో అశక్తత అవుతుంది. మనం చేసే ప్రయత్నం చెయ్యాలి. శల్యుణ్ణీ, ధృష్టకేతుణ్ణీ, జయత్సేనుణ్ణీ, కైకేయులనూ, ఇతర రాజులనూ తమ తమ బలాలతో రమ్మని పంపాలి. దుర్యోధనుడు కూడా ఆ పనే చేస్తాడు. ముందు అడిగిన వారికి సహాయంలభిస్తుంది గనక, త్వరగా సైన్యాల సమీకరణ చూడండి. ఇది చాలా భారమైన పని. వార్తలు పంపవలిసిన రాజులు చాలామంది ఉన్నారు. ఇతను నా పురోహితుడు. వృద్ధుడు, ధర్మశీలుడు. ఇతనికి ఏం చెప్పాలో చెప్పి ధృతరాష్ట్రుడి కొలువుకు పంపుదాం," అన్నాడు.

కృష్ణుడు చివరకు మాట్లాడుతూ, "ద్రుపదుడు చెప్పినట్టు చేస్తే పాండవులకు మేలు కలుగుతుంది. చేసేదానిలో రాజనీతి ఉపయోగించాలి. ఇరుపక్షాల వారూ సుఖంగా ఉండగలిగితే మనకు అంతకన్న కావలిసినది లేదు. మనమంతా పెళ్ళికి వచ్చిన వాళ్ళం. పెళ్ళి సలక్షణంగా జరిగింది. మన మందరమూ ఇక తిరిగి మన మన చోట్లకు వెళ్ళిపోవచ్చు. ద్రుపదుడు వృద్ధుడు. మన కందరికీ గురువులాటి వాడు. ధృతరాష్ట్రుడికి పంపదగిన సందేశం ఏదో ఆయనే చెబితే అక్కడ భీష్మద్రోణులు మొదలైన వారు ఆదరిస్తారు. అది మాకందరికీ సమ్మతమే అవుతుంది. దుర్యోధనుడు ఒక వేళ ఆ సందేశాన్ని లక్ష్య పెట్టకపోతే, మిగిలిన రాజులకు వార్త పంపినట్టే నాకు కూడా పంపండి," అన్నాడు.

ఇలా అని కృష్ణుడు ద్వానకకు తిరుగు ప్రయాణం అవుతున్నప్పుడు విరాటుడు అతనికి గౌరవంగా ధన కనక వస్తు వాహనాలు కానుకగా ఇచ్చి సంతోషంగా సాగనంపాడు.



# చందమామ కబుర్లు

## విలక్షణమైన హాబీ

సాధారణంగా దేశ విదేశాల స్టాంపులు, రకరకాల నాణాలు, వింత వింత పోస్ట్ కార్డుల బొమ్మలు, రంగురంగుల చాక్లెట్ కవర్లు సేకరించడం పిల్లలకు హాబీగా ఉంటుంది. అయితే, కేరళరాష్ట్రంలోని



నిలాంబూరుకు చెందిన షమీర్, షహీర్ అనే అన్న దమ్ముల హాబీ చాలా విలక్షణమైనది. నిలాంబూర్ ఏనుగులకు నిలయమైన అడవులకు ప్రసిద్ధి గాంచింది. అడవుల సమీపంలో తిరుగుతూన్న అన్నదమ్ములకు రెండేళ్ళ క్రితం, ఒకనాడు దాదాపు రెండు అడుగుల పొడవున్న పక్షి ఈక ఒకటి కనిపించింది. దానిని ఆసక్తితో ఇంటికి తెచ్చి భద్ర పరచారు. అప్పటినుంచి రకరకాల పక్షుల ఈకలు సేకరించడం, వాళ్ళకు హాబీగా తయారయింది. నెమళ్ళు, వడ్రంగి పిట్టలు, చిలుకలు, మైనాలు - - ఇలా దాదాపు 200 రకాల పక్షుల ఈకలు ఆ సోదరులు సేకరించారు. తల్లి తండ్రులూ, ఉపాధ్యా యులూ వాళ్ళను ప్రోత్సహించడంతో పాటు పక్షుల గురించి తెలుసుకోవడానికి సహాయం చేశారు. రకరకాల పక్షుల, వాటి ఆహారపుటలవాట్లు, జీవన విధానం గురించి వాళ్ళు నోట్స్ తయారు చేశారు. ఈకల సేకరణలో వాళ్ళు సంఖ్య కన్నా వైవిధ్యానికే ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నారు. అంటే– విలక్షణ మైన వింత పక్షుల ఈకలు సేకరించడం కోసమే వాళ్ళు ప్రయత్నిస్తున్నారు.

## బంగారంపై మోజు.

4,93,000 కోట్లరూపాయల విలువచేసే 9,500 టన్నుల బంగారం మనదేశంలో నిలువ ఉన్నది. ఇదంతా నగలరూపంలో మనదేశంలోని సంపన్న కుటుంబాలలో ఉన్నది. ప్రపంచంలో లభించిన బంగారంలో దాదాపు 8 శాతం మనదేశంలోనే ఉన్నది. యేటా 500 టన్నుల బంగారం మన కుటుంబాలకు చేరుతున్నదని ఒక అంచనా. ఇందులో 2 టన్నులు మాత్రమే మన దేశంలోని బంగారు గనుల నుంచి లభించే దయితే, మిగతా విదేశాల నుంచి దిగుమతి చేసుకునే బంగారం!

## వేలంపాటలో అస్థిపంజరం!

దాదాపు 65,000,000 సంవత్సరాలకు పూర్వం భూమి మీద నివసించిందని విశ్వసింపబడే ఒక డైనోజార్ అస్థిపంజరాన్ని అమెరికాలోని దక్షిణ డకోటాలో 1990వ సం॥లో హెండ్రిక్సన్ అనే ఆయన కనుగొన్నాడు. 50 అడుగుల పొడవున్న ఈ అస్థిపంజరం పేరు సూయీ. దీనిని 130 పెట్టెలలో ఇటీవల న్యూయార్క్‌కు తెచ్చారు. ఇప్పటి వరకు కనుగొన్న డైనోజార్ అస్థిపంజరాలలో దాదాపు 40 నుంచి 50 శాతం ఎముకలు శిథిలమై ఉన్నాయి. అయితే, సూయీ అస్థిపంజరంలో ఎముకలన్నీ అలాగే ఉన్నాయి. ఇటీవల న్యూయార్క్‌లో జరిగిన వేలంపాటలో చికాగో మ్యూజియం యజమాని ఒకరు దీనికి 8,400,000 డాలర్లు (దాదాపు 30 కోట్ల రూపాయిలు) చెల్లించికొన్నారు.

చందమామ
అనుబంధం
110



మనదేశపు
అందచందాలు

# పర్యాటకులనాకర్షించే కొచ్చిన్

పచ్చని చెట్టు చేమలతో, కొండలతో నిండిన దక్షిణ భారత రాష్ట్రమైన కేరళలో ఉన్న కొచ్చిన్ ప్రాచీనమైన చరిత్ర కలిగిన నగరం. చారిత్రక, సాంస్కృతిక వైవిధ్యానికి ఈ నగరం పేరుగాంచింది. ఇక్కడి నుంచి అనేక శతాబ్దాలుగా సువాసన ద్రవ్యాలు, తేయాకు, కాఫీ గింజలు మొదలైన వాటిని ప్రపంచ దేశాలకు ఎగుమతి చేస్తున్నారు. 16వ శతాబ్దంలో కొచ్చిన్‌ను మొదట పోర్చుగీసులు ఆక్రమించారు. ఆ తరవాత ఇది డచ్‌వాళ్ళ వశమయ్యింది. హార్బర్ సమీపంలో మాటన్‌చేరీలో వున్న 'డచ్‌ప్యాలస్' ను నిజానికి పోర్చుగీసులే 1557వ సం॥లో నిర్మించారు. అయితే 1663వ సం॥లో డచ్ వాళ్ళు దానిని పునరుద్ధారణ గావించడం వల్ల దాని కాపేరువచ్చింది!





కామన్వెల్త్ దేశాలలోని అతి ప్రాచీనమైన యూదుల ప్రార్థనామందిరం (సినగాగ్) ఇక్కడ ఉన్నది. దీనిని 1568వ సం॥లో నిర్మించారు. అయితే క్రీ.శ. 1వ శతాబ్దంలోనే రోమన్ వేధింపులకు భయపడి యూదులు, కేరళకు శరణార్థులుగా వచ్చారు.

కొచ్చిన్‌లో మాత్రమే చైనాదేశపు చేపలు పట్టే వలలు ఇంకా ఉపయోగంలో ఉన్నాయి.

కొచ్చిన్ చుట్టూ చాలా దీవులు ఉన్నాయి. ఈ దీవులను చేరడానికి పడవలు ఉన్నాయి. విల్లింగ్డన్ దీవి సమీపంలో డాల్ఫిన్స్ ఎగిరి పడుతూ ఉంటాయి. ఆహ్లాదకరమైన వాతావరణంలో వైపీన్ దీవిలో నడవడం హాయి గలిగిస్తుంది. కొచ్చిన్ నగరంలో రైల్వే స్టేషన్, విమాన నిలయం ఉన్నాయి. అయినా అల్లెపీ నుంచి కొబ్బరిచెట్లు కమ్ముకున్న సన్నటి కాలువల గుండా కొచ్చిన్‌కు పడవలలో ప్రయాణం చేయడం మరిచిపోలేని ఆనందానుభూతిని కలిగిస్తుంది!

పురాణకాలం నాటి రాజులు:

# ఏకవీరుడు

ఒకానొకప్పుడు పావన గంగానదీ తీరంలో చిన్నచిన్న రాజ్యాలు చాలా ఉండేవి. అటువంటి ఒక రాజ్యాన్ని హైహయ వంశానికి చెందిన ఏకవీరుడనే యువరాజు పరిపాలిస్తూ ఉండేవాడు.

ఒకనాడాయన వనవిహారం చేస్తూండగా దక్షిణదిశ నుంచి అద్భుత పరిమళం వీచింది. ఆ సువాసన ఎక్కడినుంచివస్తున్నదో వెతుక్కుంటూ బయలుదేరాడాయన. కొంతదూరం వెళ్ళాక ఒక సుందరం సరోవరం కనిపించింది. సరోవరం మధ్య అందమైన శతపత్ర తామరపుష్పం వికసించి ఉన్నది. ఆ సరోవర తీరంలో ఒక యువతి దీనంగా విలపిస్తూ కనిపించింది. యువరాజు ఆమెను సమీపించి కారణం అడిగాడు.

ఆమె పొరుగురాజ్యాన్ని పాలించే రైభ్య మహారాజు కుమారి ఏకావళి చెలికత్తె. రాకుమారి ఏకావళికి తామర పుష్పాలంటే అమితమైన మక్కువ. ఆమెకోసం రాజు అనేక తామరతటాకాలను ఏర్పరచాడు. ఈ సరోవరంలోని దివ్య కుసుమ పరిమళంతో ఆకర్షించబడి రాకుమారి చెలికత్తెతో కలిసి అక్కడికి వచ్చింది. కాలకేతుడనే రాక్షసుడు ఆమెను చూసి, ఆమె అందానికి పరవశుడై తనను పెళ్ళాడమని కోరాడు. ఆమె తిరస్కరించడంతో ఆగ్రహం చెంది, ఆమెను పాతాళగుహలో బంధించాడు. అందుకే ఆమె చెలికత్తె విలపిస్తున్నది.

ఏకవీరుడు పాతాళగుహకు వెళ్ళి, కాలకేతుణ్ణి సంహరించి, యువరాణిని వెంటబెట్టుకుని వచ్చి ఆమెతండ్రి రైభ్యమహారాజుకు అప్పగించాడు.

రైభ్యమహారాజు ఎంతో ఆనందం చెంది, "యువరాజా! నా కుమార్తెను నీకిచ్చివివాహం చేయాలని నిర్ణయించి, ఆ విషయం నీకు తెలియజేయడానికి నా మంత్రులను పంపాలనుకున్నాను. ఇప్పుడు నా కుమార్తెను స్వయంగా రక్షించి తెచ్చావు కాబట్టి, ఆమెను నువ్వే వివాహమాడాలని కోరుతున్నాను," అన్నాడు.

ఏకవీరుడు సంతోషంగా ఏకావళిని వివాహమాడాడు.



## రాజరికపు చిహ్నాలు



మధ్యయుగాలలో రాజకుటుంబాలకు చెందిన యోధులు తమ డాలులమీద అందమైన చిహ్నాలను అమర్చుకునేవారు. వాటిని 'హెరాల్డిక్ డివైసెస్' అనే వాళ్ళు. వీటిని గురించి అధ్యయనం చేసే విభాగాన్ని 'హెరాల్డ్రీ' అని అంటారు. ఈ చిహ్నాలు కేవలం అలంకార ప్రాయ మైనవి మాత్రమే కావు. క్రీ.శ. 1140 ప్రాంతంలో యోధులు వీటిని ధరించడం మొదలుపెట్టారు. ఇవి ఒకతరం నుంచి మరొక తరానికి వంశానుగతంగా వచ్చేవి. కొందరు వీటిని కేవలం డాలుల మీద మాత్రమే కాదు; శిరస్త్రాణాల కుచ్చుల మీద, కవచాలమీద, గుర్రం కళ్ళాల మీద కూడా అమర్చుకునే వారు. ఆ కాలంలో ఇప్పటిలా యోధులకు ప్రత్యేకమైన ఉడుపులు (యూనిఫారాలు) ఉండేవి కావు, కాబట్టి యుద్ధసమయాలలో తమ మిత్రులెవరో, శత్రువులెవరో గుర్తుపట్టడానికి ఈ రాజరికపుచిహ్నాలు ఉపయోగపడేవి!

## ఇంద్రధనుస్సు

### కార్ల్ లూయిస్

క్రీడాకారుల కుటుంబానికి చెందిన గొప్ప క్రీడాకారుడు కార్ల్ లూయిస్. అతని తండ్రి వ్యాయామ ఉపాధ్యాయుడు. తల్లీ, సోదరీ అంతర్జాతీయ క్రీడాకారిణులు. సోదరుడు సోకర్ ఆటగాడు. కార్ల్‌లూయిస్ క్రీడాజీవితంలో అనేక ఘన విజయాలు సాధించాడు. 1983వ సం॥లో యు. ఎస్. ఛాంపియన్‌షిప్‌లో మూడు విజయాలు సాధించాడు. 1984 ఒలింపిక్ క్రీడలలో 100మీ॥, 200 మీ॥ పరుగు పందాలలో; లాంగ్ జంప్‌లో; 4×100 మీ॥ రిలేలో నాలుగు బంగారు పతకాలు గెలుచుకుని జెస్సీ ఓవెన్సుకు సమఉజ్జీ అయ్యాడు. 1988 సియోల్ ఒలింపిక్స్‌లో 100 మీ॥ పరుగు పందెం; లాంగ్‌జంప్‌లో బంగారుపతకాలను నిలుపుకున్నాడు. లూయిస్ లాంగ్‌జంప్‌లో అత్యధిక విజయాలు సాధించడంలో ప్రథముడుగా రావడమే కాదు; ప్రపంచ స్థాయిలో కొద్ది దూరాన్ని అత్యధిక వేగంతో పరిగెత్తే 'స్ప్రింటర్'గా కూడా పేరుగాంచాడు.



స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం



[తాము ఏమి చేయాలి? ఏమి చేయకూడదు? అని నిర్ణయించే అధికారం– వ్యాపారం కోసమని ఎక్కడి నుంచో వచ్చి, రాజ్యాలను ఆక్రమించుకుంటూన్న తెల్లవారికి లేదని భారతీయ ప్రజలు భావించసాగారు. మొదట మీరట్‌లోని సిపాయిలు తిరగబడి జయించి, ఆ తరవాత ఢిల్లీకి వెళ్ళి కంపెనీ అధికారులను తొలగించారు. ఈ విజయం వేలాది సిపాయిల తిరుగుబాటుకు స్ఫూర్తి నిచ్చింది. నానాసాహెబ్ నాయకత్వంలో కాన్పూరు సిపాయిలు తిరుగుబాటు జరిపి అక్కడి కోటను పట్టుకున్నారు. చావగా మిగిలిన తెల్లవారిని క్షేమంగా అలహాబాదుకు తరలించారు. –తరవాత]

ప్రశాంతమైన సూర్యోదయంవేళ ఝాన్సీ రాజభవనం సమీపంలోని విశాల మైదానంలో ఒక యువకుడు గుర్రపు స్వారీ నేర్చుకుంటున్నాడు. ఆ యువకుడికన్నా కాస్త పెద్దవాడైన మరొక యువకుడు గుర్రాన్ని పట్టుకుని పరిగెత్తుతూ అతనికి సాయపడుతున్నాడు. కొంత దూరంలో నిలబడిన సంస్థానాధికారులు కొందరు వారికి ఉత్సాహం కలిగించే విధంగా హర్షధ్వానాలు చేస్తున్నారు. ఆ దారిన వెళుతూన్న సామాన్య ప్రజలు ఆ దృశ్యాన్ని చూసి ఆనందాశ్చర్యాలుపొందారు. గుర్రపు స్వారీ చేస్తున్న యువకుడు ఎవరా అని దగ్గరికి వెళ్ళి పరిశీలనగా చూసి పురుష వేషంలోవున్న తమ రాణి గుర్రపు స్వారీ నేర్చుకుంటున్నదని గ్రహించి మురిసి పోయారు. ఝాన్సీ రాణికి గుర్రపు స్వారీ నేర్పుతూన్న వాడు పూరీనుంచి వచ్చిన

బ్రాహ్మణ యువకుడు చందన్ హుజూరీ. ఆ యువకుణ్ణి ఝాన్సీరాణి లక్ష్మీబాయి బాల్యంనుంచీ తోడబుట్టిన అన్నగా భావిస్తున్నది.

కేవలం గుర్రపు స్వారీ మాత్రమే కాకుండా ఝాన్సీరాణి గుర్రంపై నుంచే కత్తి యుద్ధం చేయడంలో కొంతసేపు శిక్షణ పొందింది. ఒకచేత్తో కళ్ళెం పట్టుకుని మరోచేత్తో ఆమె మెరుపులా కత్తి తిప్పడం చూడడానికి వందలాది ప్రజలు గుమిగూడారు. శత్రువులను జయించడానికి తమరాణి స్వయంగా యుద్ధవిద్యలు నేర్చుకోవడం చూసి ఝాన్సీ ప్రజలు, "మహారాణి వర్ధిల్లాలి! "మాతల్లి వర్ధిల్లాలి అని ఆవేశంతో నినాదాలు చేశారు.

"ఝాన్సీ వర్ధిల్లాలి! నేను ఉన్నా, లేక పోయినా మన ప్రజల గౌరవం చిరకాలం వర్ధిల్లాలి!" అంటూ లక్ష్మీబాయి ప్రజలను సమీపించింది.

"తల్లీ! మన శత్రువులు ఎంతటి శక్తివంతులో, మరెంతటి క్రూరులో మేమెరుగుదుము. అయినా, తమరిని రక్షించుకోవడానికీ, మన రాజ్యగౌరవం నిలబెట్టడానికీ మేము మా చివరి రక్తపుబొట్టును ధారపోయడానికి కూడా సిద్ధంగా ఉన్నాం!" అన్నారు ప్రజలు.

"నా ప్రజల ధైర్యం, నేనెరుగనిది కాదు. మీ అభిమానానికి కృతజ్ఞతలు. భగవంతుడు మిమ్మల్ని రక్షించుగాక!" అంటూ లక్ష్మీబాయి చేయి పైకెత్తింది. ఆ తరవాత ఆమె గుర్రాన్ని వెనక్కు మళ్ళించి రాజభవనంలోకి వెళ్ళింది.



పద్ధెనిమిది వందలా యాభై యేడవ సంవత్సరం జూన్ నెలారంభంలో ఇది జరిగింది. ఆ రోజు మధ్యాహ్నం రాజభవనంలో మంత్రులూ, దళనాయకులూ, పురప్రముఖులూ సమావేశమయ్యారు. లక్ష్మీబాయి వారిని ఉద్దేశించి, "కాన్పూరులో యుద్ధం జరుగుతున్నది. నాకు బాల్యంలోనే యుద్ధవిద్యలు నేర్పిన సోదర సమానుడు నానాసాహెబ్ తెల్లవారిపై తిరగబడి యుద్ధం చేస్తున్నాడు. కంపెనీ సైనికులు కోటనుంచి ఎదురొడ్డి పోరాడు తున్నారు. ఏ క్షణంలోనైనా బ్రిటిష్ సేనలు ఓడిపోవడం ఖాయం. వాళ్ళు ప్రాణ రక్షణకు మరెక్కడికైనా పారిపోక తప్పదు. మనం కూడా స్వాతంత్ర్యం ప్రకటించు కోవడానికి



కూడా ఇదే సరైన సమయం అని భావిస్తున్నాను. ఈ విషయంగా పెద్దలైన మీ అభిప్రాయం తెలుసుకోగోరుతు న్నాను," అన్నది.

"మహారాణీ! మీ అభిప్రాయం సరై నదే. మనం స్వాతంత్ర్యం ప్రకటించుకోవ డానికి తగిన తరుణం ఇదే. ఇక్కడున్న బ్రిటిష్ సైనికులు మితిమించిన అహం భావంతో తాగుతూ, జూదమాడుతూ కాల క్షేపం చేస్తున్నారు. కాబట్టి ఇప్పుడు దెబ్బ తీశామంటే దిమ్మర పోతారు!" అన్నాడు ఒక ప్రముఖుడు.

ఆయన అభిప్రాయానికి రాణి మంద హాసం చేస్తూ తల పంకించి, ప్రధాన మంత్రి లక్ష్మణరావుకేసి తిరిగి, "బ్రిటిష్ రాజకీయ ప్రతినిధి మేజర్ ఎల్లీస్, దళ నాయకుడు మేజర్ మారోన్ సమక్షంలోనే నా భర్త కుమారుణ్ణి దత్తత తీసుకున్న విషయం మీరందరూ ఎరిగినదే. ఝాన్సీ రాజ్య వారసుడుగా కుమారుణ్ణీ, అతడు యుక్తవయస్కుడుఅయ్యేంతవరకు రాజ్య భారం వహించే రక్షకురాలిగా, ఏలికగా నన్నూ వాళ్ళుకూడా గుర్తించారు. అయితే ఇప్పుడు దురాశాపరుడైన గవర్నర్ జన రల్ డల్హౌసీ మాటతప్పాడు. దత్తత చేసు కోవడం అంగీకారం కాదని ప్రకటిం చాడు. మహారాజుగారు కంపెనీని గాని, డల్హౌసీని గాని దత్తత చేసుకుని వుంటే తృప్తి చెంది వుండేవారు! ఇది నమ్మక ద్రోహం. మన స్వాతంత్ర్యం కాపాడుకో వడం మన కర్తవ్యం. అలాఅని మనం ఇప్పుడే బ్రిటిష్ వాళ్ళను శిక్షించకూడదు. ఝాన్సీని శాంతియుతంగా వదిలి వెళ్ళడా నికి వాళ్ళకొక అవకాశం ఇద్దాం!" అన్నది.

"మహారాణీ! మూడేళ్ళ క్రితం ఇక్కడి బ్రిటిష్ అధికారి తమ నేతలకు రాసిన ఉత్తరం నకలు ఇది: "రాణిగారంటే ఇక్కడి ప్రజలకు ఎనలేని గౌరవాదరాలు ఉన్నాయి. ఆమె తన కుమారుడి ప్రతిని ధిగా సమర్థవంతంగా రాజ్యపాలనసాగిస్తూ ప్రజలందరి మన్ననలనూ చూరగొన్న మహిళ!" మొన్న అలా అన్న వాళ్ళే ఇప్పుడిలా ఎదురు తిరగడం వాళ్ళ దురా శకు తార్కాణం. రాజ్యపాలనకు రాణి అర్హురాలు కాదనడం మరీ విడ్డూరం!" అన్నాడు ప్రధానమంత్రి ఆవేశంగా.

"వాళ్ళు తెలిసి చేసినా, తెలియక చేసినా, దాని పర్యవసానాలను అనుభ

వించితీరాలి. ప్రధానమంత్రీ! ఈవిషయం వాళ్ళకు నిర్ద్వంద్వంగా తెలియచేస్తూ రేపే మన రాయబారులను పంపండి. ఆ తరవాత జరుగవలసిన పనుల గురించి ఆలోచిద్దాం!" అన్నది రాణి.

"చిత్తం, మహారాణీ!" అంటూ ప్రధాన మంత్రి లేచి నిలబడ్డాడు. ఆనాటి సభ ముగిసింది.

మరునాడే ప్రధానమంత్రి ఒకలేఖ రాసి రాయబారులచేతికిచ్చి బ్రిటిష్ ప్రతినిధి దగ్గరికి పంపాడు. ఆ లేఖ సారాంశం ఇది: "ఝాన్సీ స్వతంత్ర రాజ్యం! దానిని వశపరుచుకున్నామన్న భ్రమలో కంపెనీ ఉన్నట్టయితే, ఆ భ్రమ నుంచి బయట పడడానికి ఇదే చక్కని అవకాశం. మీరి క్కడ మా అతిథులుగానో, మిత్రులుగానో లేరు. మా ప్రజలను పీడిస్తున్నారు. సర్వ హక్కులు గల ఝాన్సీ రాజ్యాన్ని వదిలి మీరు ఈ క్షణమే వెళ్ళిపోవాలని కోరుతు న్నాము. లేకుంటే దారుణ పర్యవసానా లను ఎదుర్కోవలసి వుంటుంది. మీ సైనికులు మా అమాయక ప్రజలను దారుణంగా హింసించిన సంగతి మేము మరిచిపోలేదు. ఆ సంగతి మీరూ మరిచి పోకూడదు. మా ప్రజలను మీరు దోచు కుని హింసించారు. ఎందరి ప్రాణాలనో బలిగొన్నారు. మేము మీపై యుద్ధం ప్రకటించిన క్షణమే మీ చేత బాధలు అనుభవించిన మా ప్రజలు మీపై ప్రతీకారకాంక్షతో విరుచుకు పడగలరు. దానిని మేముకూడా ఆపలేము. కాబట్టి వారి ఆగ్రహానికి గురికాకుండా ఈక్షణమే



ఝాన్సీని వదిలి వెళ్ళడం మీకు క్షేమం!"

ఈసందేశం ఝాన్సీలోని బ్రిటిష్ అధి కార్ధులను ఆశ్చర్యపరచింది. అయినా శిక్షణ లేని మామూలు ప్రజలు, శిక్షణ పొందిన తమ సైనికులనేమీ చేయజాల రని ఉదాసీనం చూపారు. పైగా, కంపెనీ ఝాన్సీనికలుపుకున్నప్పుడే ఝాన్సీ సైన్యం కూడా రద్దు చేయబడింది.

ప్రధానమంత్రి హెచ్చరికను పెడచెవిని పెట్టిన బ్రిటిష్ సేనల మీద, రాణిగారి ఆజ్ఞ ప్రకారం, మాజీ సైనిక దళనాయ కుల నాయకత్వంలో ఝాన్సీ ప్రజలు కంపెనీ కోటను ముట్టడించారు. కాలా ఖాన్, మహమ్మద్ హుస్సేన్ అనే మాజీ ఝాన్సీ సైనికాధికారుల నాయకత్వంలో ఎంతో శిక్షణ పొందిన సైనికుల్లా, ఝాన్సీ

ప్రజలు ఒక్కుమ్మడిగా కోటమీదికిరావడం చూసి, బ్రిటిష్ సైనికులు దిగ్భ్రాంతి చెందారు.

"పరమ రాక్షసుడైన నీల్ నాయకత్వంలో మన ఇళ్ళను దోచుకుని తగుల బెట్టిన కిరాతకులువీళ్ళే!"అంటూకొందరు కేకలు పెడుతూ ముందుకు ఉరికారు.

"మన అన్నదమ్ములను హతమార్చిన దుర్మార్గులువీళ్ళే!" అంటూ మరి కొందరు తెల్లవారిమీద కత్తులు దూశారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ కోటమీద ఝాన్సీ పతాకం ఎగురవేసేలోగా దాదాపు డెబ్భైఅయిదుమంది ఆంగ్లేయులు హతులయ్యారు!

ఝాన్సీ విజయం ఇతర సంస్థానాలు ఎదురు తిరగడానికి మరింత ప్రేరణ కలిగించింది.

ఝాన్సీలో జరిగిన తిరుగుబాటు వార్త జూన్ ఎనిమిదవ తేదీ సాగర్‌కు చేరింది. దాంతో పాటు లలిత్‌పూర్‌లో బాన్పూర్ రాజా పెద్ద సైన్యాన్ని సమీకరించినట్టు తెలిసింది. షాఘడ్ రాజా కూడా బ్రిటిష్ అధికారులతో యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. కొద్దిరోజుల్లోనే నర్మదానదికి ఉత్తర ప్రాంతమంతా తిరుగుబాటుకు సిద్ధమయింది. బాన్పూర్ రాజా లలితపూర్‌ను పట్టుకుని, అక్కడి తెల్లవారిని ఖైదుచేశాడు. లలిత్ పూర్‌ను విడిపించడానికి మేజర్ గొసెన్ నాయకత్వంలో సాగర్ నుంచి బయలుదేరిన సైన్యం రాజా సేనలు అడ్డుపడడంతో మాల్థోన్‌ను దాట లేకపోయాయి. రాజా సైనికులు, గొసెన్ సైనికులు చేతులు కలపడంతో ఇరవై అయిదవతేదీ గొసెన్ సైనికులు బహిరంగంగా ఎదురు తిరిగారు. ఆ సమయం లోనే బాన్పూర్ రాజా ఖైదు చేసిన అధికారులనూ, స్త్రీలనూ సాగర్‌కు వెళ్ళడానికి అనుమతించాడు. అయినా వాళ్ళను మార్గమధ్యంలో షాఘడ్ రాజా పట్టి బంధించాడు. మూడు నెలలు ఖైదీలుగా వుంచి ఆ తరవాత సాగర్‌కు వెళ్ళిపోనిచ్చాడు. ఇంత జరిగినప్పటికీ ఈ ప్రాంతాలలో ఏ ఒక్కచోట కూడా బ్రిటిష్ అధికారులను విచక్షణా రహితంగా చంపడం అన్నది జరగకపోవడం హర్షించతగ్గ విశేషం! -(ఇంకావుంది)





# పెళ్ళిమాటలు

చాలావందల ఏళ్ళక్రితం కాశ్మీరుదేశం లోని ఒక నగరం సమీపంలో ఒక కొండ గుట్ట మీద ఒక రాక్షసుడు పెద్ద భవంతి కట్టుకుని నివసిస్తూ ఉండేవాడు. అప్పట్లో అలాటి రాక్షసులు ప్రపంచమంతా అక్క డక్కడా ఉండేవారు. రాక్షసులకు మెదడు చిన్నదయినా విపరీతమైన బలం ఉండ టంచేత, వాళ్ళు మామూలు మనుషులను భయపెట్టీ, దౌర్జన్యంచేసీ శ్రమలేని, జీవి తాలుగడుపుతూ, ఎదురులేకుండా, ఎవ రికీ భయపడకుండా జీవించ గలిగేవాళ్ళు. ఎవరన్నా బుద్ధి తక్కువచేత రాక్షసులను ఎదిరించినట్టయితే వాళ్ళకు అయువు చెల్లి పోయేది. క్రమంగా ఈ రాక్షసులు ఒక్కొక్కరే అంతరించి పోయారు. వారిని నిర్మూలించినది చాలావరకు యుక్తిపరులే.

ఈ కాశ్మీరు రాక్షసుడు దౌర్జన్యంతో చుట్టుపక్కల వాళ్ళను బెదిరించీ, దోచీ అంతులేని బంగారమూ, వస్తువులూ సంపాదించాడు. ఈ రాక్షసుడు లోకులను కొల్లగొట్టినా, అప్పుడప్పుడూ మనుషులను చంపినా నగరవాసులకు అంతబాధ కలగ లేదుగాని, వాడు వున్నట్టుండి నగరంలోకి వచ్చి, "మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చెయ్యండి," అని ఎవరినో ఒకరిని కోరేవాడు. ఇవ్వమనడానికిలేక పెళ్ళి చేస్తే, ఆ పెళ్ళాం ఎంతోకాలం బతికేది కాదు. రాక్షసుడు మరొక పెళ్ళాం కోసం వచ్చే వాడు. ఇది నగరంలో వాళ్ళకు, అందు లోనూ ప్రత్యేకించి పెళ్ళి కాని కన్యలకు, పెద్ద పీడ అయికూర్చున్నది.

ఈ విధంగా ఇరవైనలుగురు భార్యలను పోగొట్టుకున్న అనంతరం రాక్షసుడు ఇరవై అయిదోసారి పెళ్ళాడగోరి నగరానికి బయ లుదేరాడు. ఒక పేద రైతు పొలంలో పని చేసుకుంటున్నాడు. రాక్షసుడు ఆ రైతును




పోయినా నీ దరిద్రం తీరిపోవటం మాత్రం ఖాయం," అన్నదామె తండ్రితో.

మల్లిక సలహాపైన ఆమె తండ్రి తన దగ్గిర ఉన్న డబ్బంతా ఖర్చుచేసి బోలెడన్ని వంట కుందేళ్ళనూ, ఒక పీపా ద్రాక్షసారాయినీ సంపాదించాడు. మల్లిక ఇరుగు పొరుగు ఇళ్ళకు వెళ్ళి, వందలకొద్దీ నేత బట్టలను అరువుతెచ్చి, వాటిని గోడలవెంబడి అరలలో పేర్చిపెట్టింది. రాక్షసుడు భోజనానికి వచ్చేరోజున, పెద్ద అండానిండా కుందేళ్ళ మాంసం ఇగురు రుచిగాచేసింది. రాక్షసుడు భోజనానికి కూర్చునే చోట ఒక పక్కన కూర అండా, రెండో పక్కన సారాపీపా ఏర్పాటు చేసింది.

రాక్షసుడు వచ్చాడు, భోజనానికి కూర్చున్నాడు. కూర దివ్యంగా ఉన్నది.

"నాకోసం, పాపం, మీకుచాలా ఖర్చయి ఉండాలి, నేను కాస్త తిండిపుష్టిగలవాణ్ణీ, భోజన ప్రియుణ్ణీ కూడానూ," అన్నాడు రాక్షసుడు.

"దానిదేముందిలెండి? ఎలకలున్నంత కాలమూ ఖర్చేముంటుంది? ఎలకలు చాలకపోతే పిండి కొంచెం జాస్తి చేస్తే సరిపోయె," అన్నది మల్లిక.

"ఎలకలతో ఇంత రుచిగా వండావా? నేను కట్టుకున్న తప్పుడుముండల్లో ఒక్కతెకూడా ఎలకలను వండిన పాపాన పోలేదంటే నమ్ము," అన్నాడు రాక్షసుడు, తన కాబోయే భార్య పొదుపును మనసులో మెచ్చుకుంటూ. వాడు పైకి, "నీకు నేత కూడా వచ్చుననుకుంటాను?" అన్నాడు.

సమీపించి, "నాకు మీ అమ్మాయి నిచ్చి పెళ్ళిచెయ్యి," అన్నాడు. రైతుకు మతిపోయింది. అతనికి మల్లిక అనే ఒక కూతురున్నది. ఆ పిల్లకు పెళ్ళి ఈడువచ్చి కొంతకాలమయింది. కాని పేదవాడు కావటంచేత తండ్రి మల్లికకు ఇప్పటిదాకా పెళ్ళి చేయలేకపోయాడు.

"నేను ఎల్లుండి రాత్రి మీ ఇంటికి భోజనానికి వస్తున్నాను. అప్పుడు పెళ్ళి మాటలు మాట్లాడుకుందాం," అని చెప్పి రాక్షసుడు తన ఇంటికి వెళ్ళిపోయాడు.

రైతు ఇంటికి వచ్చి రాక్షసుడన్నది చెప్పినప్పుడు మల్లిక ఏమాత్రమూ కలవరపడలేదు. "నేను చెప్పినట్టుచేసి, అనమన్నట్టు అను. రాక్షసుడు మన సంబంధం వదులుకోవచ్చు, ఒక వేళ వదులుకోక

మల్లిక తనచేతిగుడ్డ పట్టుకున్న చెయ్యి బారచాచి, "ఇదంతా నేను కిందటి నెల వడికి తయారు చేసినదే," అని చెప్పింది. ఆమె చెయ్యి, చుట్టూ అమర్చిన బట్టల దొంతర్లకేసి చాచి ఉండటంచేత ఆ బట్ట లన్నీ మల్లికే వడికి, నేసిందనుకున్నాడు రాక్షసుడు. వాడికి మల్లిక మీద కలిగిన సద్భావం రెట్టింపయింది. వాడు తినటం పూర్తిచేసి సారా ఒకలోటాడు తాగి, "చాలా బాగుంది. దీనికైనా డబ్బు బాగా ఖర్చు అయి ఉండాలే?" అన్నాడు రైతుతో.

"ఖర్చేముందీ? కుళ్ళిపోయిన పళ్ళు సారా తీయటానికితప్ప మరెందుకూ పనికి రావుగా. దాని విషయం మామల్లికే చూసు కుంటుంది," అన్నాడు రైతు.

"కుళ్ళిన పళ్ళనుంచి ఇంత మంచి సారా వస్తుందని నాకు తెలియనే తెలి యదు. మేం వాటిని పందులకు వేస్తాం. మల్లిక కాపరానికి వచ్చాక ఆ పద్ధతి మార్పించేస్తాను. మీరు కట్నం ఏపాటి ఇవ్వబోతున్నారు?" అన్నాడు రాక్షసుడు.

"మల్లికే పెద్దకట్నం. ఇంక వేరే కట్నం కూడానా? అది కాపరానికి వెళ్ళిపోతేనాకు చాలా నష్టం వస్తుంది. అందుచేత దాన్ని చేసుకోబోయేవాడు నాకేపెద్దమొత్తం ఇవ్వ వలిసిఉంటుంది. ఈ వూరి పెద్ద షావుకారు భార్య పోయిందిగా? మళ్ళీ పెళ్ళి చేసు కుందామన్న ఆలోచనలో ఉన్నాడు. మల్లిక నిస్తే, కోరినంత ఇస్తానని అక్కడా అక్కడా అన్నాడు కూడానూ," అన్నాడు రైతు.

రాక్షసుడికి కోపంవచ్చి, "నాతోనే అంటున్నావా ఈ మాట? నేను నీకూతుర్ని



బలవంతాన ఎత్తుకుపోయి పెళ్ళాడితే నన్ను నువ్వు ఆపగలవా?" అన్నాడు.

"అంటే, మీకు మల్లిక సంగతి ఏమీ తెలీదన్నమాట. అది మహా మకురుమనిషి. మొండికేసిందంటే, ముక్కలుముక్కలుగా నరికినా సరే ఏ పనీ చేయదు, మంచిగా దానిచేత పనులు చేయించుకోవలిసిందే గాని," అన్నాడు రైతు.

"సరే, సరే," అంటూ రాక్షసుడుతాను రైతుకు ఇవ్వాలనుకున్న మొత్తం చెప్పాడు. "చాలదు. దానికి రెండింతలైతేనే పని జరుగుతుంది," అన్నాడు రైతు.

రాక్షసుడు ఆలోచించాడు. మల్లిక కోసం తాను ఇచ్చేది తిండికిందా, తాగుడు కిందా త్వరలోనే ఆదా అయిపోతుంది. ఎంత ఇచ్చినా నష్టం ఉండదు. ఇలా




లతో నాకొక పరుపు తయారుకావాలి.నేను సుఖంగా నిద్రపోనిదే, కష్టించి పని చెయ్య లేను," అన్నది.

"ఇంకా నగానట్రా అడగలేదు,నయం," అనుకున్నాడు రాక్షసుడు. మళ్ళీ మనుష లనుపెట్టి కట్టిస్తే కూలి డబ్బులు దండగ అని, రాక్షసుడు మల్లిక కోరిన ఇంటిని, ఆమె చెప్పే విధంగా తానే కట్టాడు.

ఇంతలో శీతాకాలం వచ్చింది. మల్లిక పరుపు కోసం గుడ్డను సంచీరూపంలో తయారుచేసి, మంచు పడటం కోసం వేచి ఉన్నది. మంచు పడటం ప్రారంభం కాగానే ఆ ప్రాంతాలవాళ్ళు, "ముసలమ్మ బాతుల ఈకలు పీకుతున్నది," అంటారు.

త్వరలోనే మంచుకూడా పడసాగింది. "బాతు ఈకలు రాలుతున్నాయి. ఏరుదువు గానీ రా," అని మల్లిక రాక్షసుడికి కబురు చేసింది. వాడు వచ్చి, మంచు పడుతూం డటం చూసి, "ఎలా ఏరటం?" అన్నాడు.

"మందమతీ, పార తీసుకొచ్చి ఈకలు ఎత్తి నాసంచీలో వెయ్యి," అన్నది మల్లిక.

రాక్షసుడు మంచును పారతో ఎత్తి పరుపు సంచీలో వేస్తుంటే సగానికి సగం అప్పటి కప్పుడే కరిగిపోతూ వచ్చింది. ఎలాగైతే నేం, సాయంకాల మయ్యేట ప్పటికి సంచీ నిండింది. మల్లిక సంచీ మూతి కుట్టేసి, ఆ మంచు పరుపు మీద దుప్పట్లు పరిచి, "ఈ రాత్రికి దీని మీదనే పడుకుని ఎంత సుఖంగా ఉంటుందో చూడు. రేపుమనం పెళ్ళాడేద్దాం," అన్నది.

అలిసిఉన్న రాక్షసుడు ఆ మంచు పరుపు మీద పడుకున్నాడు. వాడు

అనుకునిరాక్షసుడు తాను మొదట ఇస్తా నన్న దానికీ, రైతు అడిగినదానికీ మధ్యగా ఇంకో మొత్తం చెప్పాడు. రైతు రాజీపడి ఒప్పుకున్నాడు. అతను యావజ్జీవమూ సుఖంగా బతకటానికా డబ్బు చాలును.

"సరే, రేపు ఆ డబ్బు తెచ్చిఇచ్చి మల్లి కతో మాట్లాడండి. అది ఇప్పుడు పడుకుని నిద్రపోతున్నది," అన్నాడు రైతు.

మర్నాడు ఉదయం రాక్షసుడు సంచీలో డబ్బు తెచ్చి రైతుకిచ్చాడు. మల్లిక వాడితో మాట్లాడుతూ, "నన్ను పెళ్ళిచేసుకునేవాడు నా కోరికలు రెండు చెల్లించాలి. కాపరం పొదుపుగా జరగ గలందులకు నాకొక కొత్తిల్లు, నేను చెప్పిన మోస్తరుగా కట్టించి ఇవ్వాలి. రెండోదేమంటే, ముసలమ్మ బాతుల ఈకలు పీకేటప్పుడు తాజా ఈక

ఎంత ప్రయత్నించినా ఒంటికి వెచ్చదనం మటుకు కలగలేదు. పరుపుమీద పరిచిన దుప్పట్లు తడిగా ఉన్నట్టుకూడా వాడికి తోచింది.

మర్నాడు తెల్లవారి లేచేసరికి రాక్షసుడి శరీర మంతా తీవ్రంగా బాధపెడుతున్నది. ఎముకల దగ్గిర నుంచీ సలుపుతున్నాయి. కదలటానికి కూడా వాడికి తగని బాధగా ఉన్నది. పరుపేమో సగం కరిగి పోయింది.

"లాభంలేదు. మల్లిక సమర్థురాలే గాని, ఇటువంటి పరుపు మీద పడుకుంటే నాకు చావు తప్పదు," అనుకుని రాక్షసుడు ఇంటికి వెళ్ళిపోయాడు. మల్లిక వచ్చి, "పెళ్ళి చేసుకుందాం పట్టు," అంటుందేమో నని వాడికి హడలు పుట్టుకొచ్చింది

రాక్షసుడు వెళ్ళిపోయాడని తెలియగానే మల్లిక రాక్షసుడి ఇంటికి తన తండ్రిని పంపింది. రైతురాక్షసుడి ఇంటికివెళ్ళి, పెళ్ళి కూతురు కనిపెట్టుకుని ఉన్నదని లోపలికి కబురు చేశాడు.

"నాకు ఒంట్లో బాగాలేదు. పెళ్ళాడలేనని చెప్పు," అని రాక్షసుడు రైతుకు తననౌకరు ద్వారా జవాబు పంపాడు.

ఆ నౌకరు తిరిగి వచ్చి, "వాళ్ళమ్మాయికి ఆశాభంగం కలిగించినందుకు పరిహారం ఏమిచ్చుకుంటావో అడగమంటున్నాడు రైతు," అన్నాడు.

"కట్నం ముందుగానే ఇస్తిని, ఈకల పరుపిస్తిని. ఇంకేం కావాలిట?" అన్నాడు రాక్షసుడు.

"నువ్వు ఈకల పరుపును అప్పచ్చిలా చేశావుట. ఇంకొన్ని బాతు ఈకలు ఏరి పెట్టాలిట," అన్నాడు నౌకరు తిరిగివచ్చి.

"మన దొడ్లోఉన్న బాతులన్నిటినీ తోలుకుపోయి ఏగంగలోనన్నా దూకమను. మారు మాట్లాడితే విరుచుకు తింటానని చెప్పు," అన్నాడు రాక్షసుడు తన నౌకరుతో.

ఈ మాట రైతు చెవినపడిన మరుక్షణం అతను బయలుదేరి, వెళుతూ వెళుతూ రాక్షసుడిబాతులన్నిటినీ తోలుకుపోయాడు.

రాక్షసుడు ఈకలపరుపు దెబ్బ నుంచి తిరిగి కోలుకోనేలేదు. వాడింకెవరి అమ్మాయినీ పెళ్ళాడతానని కూడా అనలేదు.

మల్లిక మాత్రం రాక్షసుడి డబ్బుతో స్థితిమంతురాలై, తనకు తగిన భర్తను సంపాదించుకుని, సుఖంగా జీవించింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1998 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



MAHANTESH C. MORABAD



MAHANTESH C. MORABAD

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * డిసెంబర్ నెల 25వ తేదీలోగా, వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:

చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్– 600 026

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఆడుకునే వేళ!

రెండవ ఫోటో : అడ్డుపెట్ట నేల?

పంపినవారు : శ్రీమతి ఎమ్. భానుప్రియ, W/o ఎమ్. భానుమూర్తి

682/B, రోడ్ నెం-10, వైదేహినగర్, వనస్థలిపురం, హైదరాబాదు –500 070


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్ - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., Chandamama Buildings, Chennai - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, 188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 (India) Editor : NAGI REDDI.

CHANDAMAMA (Telugu) December 1997 Regd. No. M. 4854/97
Registrar of News Papers, India. RN 114 / 57